శ్రీశారదాంబాయై నమః




# శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

కీలక — మార్గశీర్ష పౌషములు

సంపుటము 57 — సంచిక 5



సంపాదకుడు

కాకరపర్తి కృష్ణశాస్త్రి

శ్రీశారదాంబాయై నమః




శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

కీలక మార్గశీర్ష పౌషములు

సంపుటము 57 సంచిక 5



సంపాదకుఁడు

కవికంఠీరవ, కవిమూర్ధన్య, ప్రౌఢకవిచంద్ర, విద్వత్కవివర,
బ్రాహ్మీభూషణ కాకరపర్తి కృష్ణశాస్త్రి

సంవత్సరమునకు చందా
రు. 3/—

విడిప్రతి
0-60 పైసలు

# ఆంధ్రసాహిత్యపరిషత్తు

ప్రతిష్ఠాపకులు :

ఆంధ్రభోజ, మహారాజ,

శ్రీశ్రీశ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరువారు సి. బి. ఇ., డి. లిట్, పిఠాపురము మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

వ్యవస్థాపకులు :

శ్రీ జయంతి రామయ్యగారు

ఉద్ధారకులు :

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు, జమీందారు, ఉయ్యూరు.

# ఆంధ్రసాహిత్య పరిషత్తు (రిజిష్టర్డు)

## కా కి నా డ

అ ధ్య క్షు లు

విమర్శకాగ్రేసర, ఐతిహాసికసమ్రాట్

శ్రీ బండారు తమ్మయ్యగారు

ప్రధానకార్యదర్శి, కోశాధికారి

అ భి న వ భో జ

శ్రీ దంటు భాస్కరరావుగారు

సహాయ కార్యదర్శి

కవిశిరోమణి, ఉభయభాషాప్రవీణ (A)

శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు

కార్యనిర్వాహక సభ్యులు

1. శ్రీ కోశా శివనాథశాస్త్రిగారు
2. బాలవ్యాస, శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు
3. భాషాప్రవీణ, వ్యాకరణ విద్యాప్రవీణ
   శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు
4. కవిమూర్ధన్య, ప్రౌఢకవిచంద్ర
   శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రిగారు
5. శ్రీ జయంతి బుచ్చిరామశర్మగారు
6. శ్రీ దామెర రాజగోపాలరావుగారు, బి. ఏ;
7. శ్రీ నేదునూరి రామచంద్ర కీర్తిగారు, ఎమ్. ఏ; (ఆనర్సు)
8. సాహిత్యవిద్యాప్రవీణ, ఉభయభాషాప్రవీణ
   శ్రీ ఓలేటి వెంకట సుబ్బరాయశాస్త్రిగారు
9. శ్రీ కావలి శ్రీరామమూర్తిగారు, బి. ఏ., బి. ఎల్;
10. శ్రీ నరసింహదేవర కృష్ణశాస్త్రిగారు
11. శ్రీ చిరునోము వెంకట రామమూర్తిగారు

# విషయసూచిక

కీలక మార్గశీర్ష పౌషములు.

సంపుటము ౪౫ సంచిక ౪

# అన్నవర సత్యనారాయణస్వామి

—శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రి.

ఉ. ఈ నగమందు నిన్నొకమ
హీసురమౌళి ప్రతిష్ఠజేసె; నా
పై నొక పద్మనాయకవి
భాసురభూపతి నీకు సన్మహా
స్థాని నొకండు కల్పనము
సల్పె; విశాలమహాంధ్రవైభవా
నూనని కామ సేవనము
లొందితి వీ విటు సత్యదైవమా!

మ. హరియే యుత్తమదైవతం బనుచు, శీ
తాహార్యకన్యామణీ
వరుడే యుత్తమదైవతం బనుచు వి
వాదంబు గావించు పా
మరలోకమ్ముల భేదధీకలన సం
మార్జింప నూహించి నీ
సరస న్నిల్పితి విందుమౌళిని పరే
శా! సత్యనారాయణా!

చ. తిరుపతి వేంకటేశ్వరు ను
తింప దలంపదు, తత్ప్రసాద మే
నరుఁడును బ్రీతి గైకొన, డ
నంతభవన్మహిమానుభూతులన్
మఱిగిన నీ ప్రసాద మను
మాత్రము గొన్నను "రాజు జూచినన్
వరుఁ గన మొత్త బుద్ధి" యను
వాక్యము సత్యము సత్యదైవమా!

మ. పరిశీలింత్రు వసంతకాలికశుభ
ప్రాభాతకాలంబులన్
పరిపూర్ణం బగుభక్తి యాత్రికజనుల్
పంపావగాహైకలో
పరిసంచారనిషక్తతావకపదా
బ్జాతద్వయీరేఖలన్
పరుసన్; సత్యవతీసతీసహిత దే
వా! సత్యనారాయణా!

మ. భువిలోనం గల రెండతేనియును దే
వుల్, వార లాముష్మిక
ప్రపణాజ్ఞానఫలైకదానఘును; లీ
వా వైహికాముష్మిక
స్తవనీయద్విఫలప్రదానచణని
ష్ణాతుండ, వీ పండితుల్
కవుఁఁన్ గాయకు లెల్ల నాత్మలు శుభాం
గా! సత్యనారాయణా!

మ. భవదీయానుపమాన సన్మహిమమున్
వర్ణింపగా నేర్చునే
కవిమూర్ధన్యుఁడు; నాల్గువేదములె మూ
కత్వంబు గైకొన్నచో
నెవియో నాలుగుపద్దెముల్ గొలికి నీ
కే వీని నర్పించెడిన్
కవనం బీక్రియ ధన్య మా నసెడికాం
క్షన్ సత్యనారాయణా!



## బట్టుమూర్తి - మూర్తికవి

శ్రీ టేకుమళ్ల కామేశ్వరరావు, బి. ఏ. బి. ఇడి.,

(గత సంచికానుబంధము)

### 7. సికస్తదశ

1565 నాటి రక్కసతంగడియుద్ధములో విజయనగరసామ్రాజ్యమునకు విపత్తు సంభవించినది. శతృవులు జయించినారు. ఆ యుద్ధములో రామరాజాదులు మరణించిరి. తిరుమలరాయని పెద్దకొడుకైన రఘునాథరాయని జాడ తెలియదు. తిరుమలరాయఁడు సదాశివరాయలతో, తన కుమారులతో, కొంత ధనముతో పెనుగొండకు పారిపోయి, తిరిగి వచ్చి, విజయనగరమును మరల ముఖ్యపట్టణముగా చేయుటకు ప్రయత్నించి వ్యర్థుఁడైనాడు. తిరిగి పెనుగొండకు దయచేసినాడు. కాని అక్కడకూడ శతృవుల దాడులకు తట్టుకొనలేక 1572లో [12]చంద్రగిరికి రాజధానిని మార్చివేసినాడు. కాని అతని కుమారుఁడు శ్రీరంగరాజు మాత్రము పెనుగొండమండలాధికారిగా నుండినాడు.

సామంతప్రభువులు స్వతంత్రించినారు. అతఁడు విశేషముగా శ్రమపడి తన హోదాను కొంత నిలబెట్టుకొన్నాడు. రాజ్యము నామమాత్రముగా నున్నది. విజయనగరము ముఖ్యపట్టణముగా నుండకుండుటచేత విజయనగరసామ్రాజ్యమను పేరునకు తగదు. ముఖ్యపట్టణము ఇతరతావులకు మారుచుండినది. చమురులేని దీపము మరికొంతకాలము వెలిగినట్లుగాను, సూర్యాస్తమయమునకు బిమ్మట వెలుగు కొంతసేపు నిల్చినట్లుగాను, రాజ్యము మరికొంత కాలముండినది.

---

12. కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారి ఆంధ్రవిజ్ఞానసర్వస్వములోఁ జెప్పఁబడిన యంశము ఆంధ్రకవి తరంగిణి సం 9-56 లో నుటంకింపఁబడినది.

తిరుమలరాయఁడును, అతని కుమారుఁడు శ్రీరంగరాయలును తీవ్రప్రయత్నములు చేసినమాట నిజము. కాని ఫలితము హెచ్చరిక పుట్టించునట్టిదిగా లేదు.

వసుచరిత్ర, నరసభూపాలీయములలోఁ జెప్పఁబడిన తిరుమల రాయల పెనుగొండ పట్టాభిషేకము, తళ్లికోటయుద్ధమునకు పిమ్మటిదని కొందఱు విమర్శకులు భ్రమపడుచున్నారు. అదికాదు. సమానాంతర ప్రభుత్వస్థాపనకై అళియరామరాయలు, తిరుమలరాయలకు పెనుగొండలో 1542-43 లో చేసిన పట్టాభిషేకమదియె. యువరాజు నిర్ణయముగూడ నైనది.

వసుచరిత్రలో వర్ణింపఁబడినది తళ్లికోటయుద్ధమునకు పూర్వ వైభవము మాత్రమె యనుటకు మరికొన్ని నిదర్శనములను గూడ జూచెదము.

మ. . .నామకథనక్లామ్యన్మహాఢిల్లికా
గథరాదాద్యరిధామ. . .(వసు 1-101)

అని చెప్పఁబడినది. అనగా తిరుమలరాయని జూచి ఢిల్లి, ఆగధ (?) పాదుషాల మొగములు వాడిపోవుచున్నవి. తిరుమలరాయఁడు ద్రవిడ, లాట, కురువ, రాట, దహాళ, భోటదేశములను గెల్చినాడు. బెడద కోట తలుపులను పగులఁగొట్టినాడు (వసు 5-129). అతని కుమారుఁడైన శ్రీరంగరాయలు విజయములు (ఆ 1-73) కూడ నించుమించుగా నట్టివియె. వారిద్దఱిలో నెవరు ముందుగా జయించిరో, యేమో! వారేకాదు మరికొందఱుకూడ వాటిని జయించినారను విషయమును ఇటుపైన జూచెదము. ఆత్మరక్షణకై అలమటించుచున్న తిరుమల రాయని నట్లు వర్ణించుట మొగతాళిచేయుట వంటిదికాదా? కాఁబట్టి యా వైభవమంతయును తళ్లికోటయుద్ధమునకు ముందరిదశయని స్పష్టముగా పోల్చుకొనవచ్చును.

మూర్తికవి కావ్యాలంకార సంగ్రహములోఁ జెప్పిన యట్టి యంశములను గొన్నిటిని జూచెదము. అళియరామరాజునకు ఇద్దఱు అన్నలు, ఇద్దఱు తమ్ములునుగదా! వారిని గుఱించి చూచెదము. పెద్దన్నయైన కోనరాజు (ఆ 1-78) లాట, గౌళ, అంగ, భోజ, కుంతల ముల జయించెను. చిన్నన్న శ్రీరంగరాజు (ఆ 1-80) పౌరుషవంతుఁడు. అళియరామరాజు (ఆ 1-82) సల్కాయ తిమ్మనను జంపెను. కుతపనమల్కాను గెల్చెను. రాచూరి, ముద్గలులను స్వాధీనము చేసుకొనెను. సపాదుని కీసును జయించెను. మల్కానిజామునకు నభయమిచ్చెను. రామరాజ్యముగాఁ జేసెను. అతఁడు (1-83) కలియుగనవ్యరామావతారుఁడు. తమ్ముఁడైన ఎఱ్ఱతిమ్మరాజునకు (1-84) చాళుక్యనారాయణ, మన్నెవిభాళబిరుదులున్నవి, తమ్ముఁడు వెంకటాద్రి బరీదును (1-85), భీమరథి నదిపొంతను సపాదును (1-87), ఏదులఖానుని (1-88) గెల్చెను.

కృతిపతియైన నరసరాజు మన్నెమార్తాండ, మన్నియ గండరగండఁడు (1-102). అతఁడు బరీద, సపాదులను (1-105) గెల్చినాడు; పీనన(?) మల్కాస్థాపకుఁడు (1-106); తొరగంటిదుర్గాధిపతి (1-107); క్రతుపుర నారాయణునకు ప్రాకారమును గట్టించినాడు (1-108); పాంచాలగౌడులచేత స్తుతింపఁబడుచున్నాఁడు (1-127); కుంతల, గౌళ, చోళ, కురు, ఘూర్జర, హూణ, శకాదులను (2-8), పారసీక, యవన, ఖాన్ మల్కలను (2-10), కటకాధిరాజ, హయపతిని (4-1), సపాదుని (4-64) గెల్చెను. అతడు మర్ఠా, మండువా, పండువా భయదుఁడు; హిందూరాజ్యసంస్థాపకుఁడు. (5-243); సాహిత్యఁభోజుఁడు. అతఁడు చేయనిపని భూమిమీద లేదేమో! అతని కొడుకు శ్రీరంగరాజు కుమారనారాయణుఁడు (1-98). అట్లు ఒకేరకమైన బిరుదులను ఆరాజులు ధరించుచుండుటను గమనింపవచ్చును. ఆ వైభవమంతయును తళ్ళికోటకి పూర్వపుదని విశేషశ్రమ లేకుండనె గ్రహింపవచ్చును.

## 8. కొన్ని తికమకలు

వసుచరిత్ర, నరసభూపాలీయముల పీఠికాదులలోని ప్రతి పద్యములోను జెప్పఁబడిన చారిత్రకాంశములను జాబితాగా వేసి చూచిన యెడల నీక్రింది తికమకలు కొన్ని గోచరించును. నవాబులకు ఆదిల్ షా (సవాధ), నిజామ్, కుతుబ్ షా, బరీదువంటి పేళ్లు కనఁబడును. అవి యెవ్వరి పేళ్లో వెంటనే గ్రహింపలేము. ఏలననగా నవి వంశనామములు గాని వ్యక్తుల పేళ్లు కావు. రాయచూరు, ముద్గల్, దోఆబ్ యిత్యాది స్థలములు పలుసార్లు చేతులు మారుచుండుటచేత ఆ మాటలు కాల నిర్ణయమునకు వెంటనే తోడ్పడవు. మఱియొక బాధ యేమనగా, ఒక యుద్ధమునకు నలుగురు వీరులు వెళ్లగా, ఆ నలుగురిని గుఱించి వేర్వేఱుగా వర్ణించినప్పుడు, చెప్పినయంశములే మరల చెప్పఁబడుచుండును. ఇంకొకసంగతి- చక్రవర్తి బిరుదులు రామరాజాదులు నిర్భయముగా ధరించిరి. కాఁబట్టి వారిలో నెవ్వఁడు పట్టినను మహారాజుగానె కనఁబడును. దానికితోడు వసుచరిత్రలో శ్లేషవలన అర్థము నిశ్చయమగుట క్లిష్టము. అట్టి పరిస్థితులవలన వాటిలోని యంశములను బట్టి కాలనిర్ణయమును సులువుగా చేయలేము. నిశ్చితమైన యొక యాధారము దొరికినపిమ్మట మిగత యంశముల కాలమును జెప్పవచ్చును. కాని యట్టి యాధారములు వ్రేళ్లపై లెక్కింపదగినన్ని మాత్రమె యున్నవి.

కవులు కృతిపతులను వర్ణించుటలో గ్రంథపరిమితికై కొన్ని నియమములను బెట్టుకొనిరి. కృతిపతియొక్క పూర్వులను వర్ణించుచున్నప్పుడు కృతినాయకునికి నేరుగా సంబంధించిన కోవవారినే వర్ణించుచుండిరి. వసుచరిత్రకర్తయైన రామరాజభూషణుఁడు తన పేరునకు కారకుఁడైన అళియరామరాజును పేర్కొన్నప్పుడు, అతని బిడ్డల ప్రశంసయే తేలేదు. కాని కృతినాయకుఁడైన తిరుమలరాయని సంతానమును పేరుపేరు వరుసను వర్ణించినాడు. అట్లె నరసభూపాలీయకర్త

తన కృతినాయకుఁడైన నరసరాజుయొక్క మేనమామలైన అళియ రామరాజాదులను మాత్రమె వర్ణించినాఁడు. కాని వారి సంతానమును వర్ణించలేదు. అయితే కృతినాయకుఁడైన నరసరాజుయొక్క కొడుకును వర్ణించినాఁడు. అట్టి హద్దులను బెట్టుకొనకున్నచున్నచో, అవతారిక అనంతముగా బెరిగిపోవును.

వసుచరిత్ర కావ్యము ప్రత్యేకముగా తిరుమలరాయనికి నంకిత మీయఁబడినది; కాఁబట్టి అతనిని గుఱించి యధికవర్ణనలు తప్పవు. వాటిలోని సంగతులను జూచెదము. పెనుగొండను బ్రహీంఖాన్ సేన లెదిరించినవి (1-59). ఆ ఖాన్ యెవ్వఁడో తెలియుటలేదు. అతఁడు [13]ముస్తాఫాఖాన్ కావచ్చునని వఝలవారి వ్రాత. కాని ఆ మాటకు అర్థము బీదర్ సంస్థానాధిపతియైన బరీదు కావచ్చును. అతఁడు నరసభూపాలీయములోఁ గూడ పేర్కొనఁబడినాఁడు. అచ్యుతరాయల నీరస ప్రభుత్వములో నవాబులు పెనుగొండనుగూడ ముట్టడించి గెల్చిరి. రామరాజు పెనుగొండను చేరి తన తమ్మునికి పట్టాభిషేకమును (1-62) జరిపినాఁడని యిదివఱకె చెప్పియుంటిమి. తిరుమలరాయని రాణి తిరుమలాంబ స్తుతింపఁబడినది. అతని పెద్దకుమారుఁడు రఘునాథుఁడు యుద్ధవీరుఁడై కృష్ణానదీతీరమును గాపాడుచుండెను (1-69). రెండవవాఁడైన శ్రీరంగరాజు యువరాజాయెను (1-71). అతఁడు కుంతలాది దేశములను జయించెను (1-73). మూఁడవకొడుకు రామరాము శ్రీరంగపట్టణమును జయించెను (1-79). నాల్గవవాఁడైన వెంకటరాజు చంద్రగిరిలో (1-81) నున్నాఁడు. అతఁడు కవిపోషకుఁడు. పోషించిన కవులపేర్లు తెలియవు. అట్లు తనయులందఱును సుఖముగా నుండగా తిరుమలరాయలు పాలించుచున్నారు (1-85). అప్పటికింకను అళియరామరాజుగాని, తిరుమలరాయుల సంతానములో నొక్కఁడునుగాని చావలేదని గ్రహింపవచ్చును.

---

13. హరిశ్చంద్రనలోపాఖ్యానము (వావిళ్లముద్రణ 1918). పీఠికను వఝల చిన సీతారామస్వామిశాస్త్రిగారు వ్రాసినారు. పీఠిక పుట 7.

### 9. కావ్యముల రచనా కాలము.

వసుచరిత్ర అంకితముకొనకు తిరుమలరాయలు రామరాజ భూషణుని నాహ్వానించి పలికిన పద్యమును (1-17) జూచినయెడల రామరాజు జీవుఁడై యున్నట్లు కనఁబడును. తిరుమలరాయునికి ముఖ్యముగా రామానుజత్వమె (1-13) వ్యక్తిత్వము. అతఁడు శ్రీరామచంద్రచరణకమలయుగళాభివందనుఁడు (1-14). ఆ మాటలలో రామరాజును శ్లేష లేకపోలేదు.

వసుచరిత్ర, నరసభూపాలీయములలో పేర్కొనఁబడిన చారిత్రకాంశములలో అతి నవీనచారిత్రకఘటన ఈ క్రిందిది మాత్రమె. కల్యాణపట్టణము రామరాజు చేతులలో నున్నది. అది హుస్సేన్ నిజామ్‌షా రాజ్యములోనిది. అతఁడు ఇబ్రహీమ్ కుతుబ్‌షా సహాయముతో నా పట్టణమును జయింపఁగోరి, రామరాజుమీఁదికి దండెత్తి యోడిపోయి, అందితే జుట్టు, అందకపోతే కాళ్ళు అను సామెత ననుసరించి, కుతుబ్‌షాను నిందించుచు, రామరాజును శరణుజొచ్చెను. రామరాజు అజ్ఞానముగా నతనిని క్షమించెను. 1559 లో జరిగిన యీ ఘటనయే ఈ క్రింది చరణములలో పేర్కొనఁబడినది—

సీ. రతినిభ రామానుగతమైత్రిపై రోసి
కలనైన కల్యాణకాంక్ష నిడదు

♦ ♦ ♦

తే. నిజాముఁడపవర్గ మార్గవృత్తి
బెరయు పరబుద్ధి నెవ్వాని పేరుదలఁచి,
యతఁడు శ్రీరాముఁ డఖిలసన్నుతికిఁ దగఁడె.

(వసు 1-48)

సీ. శరణన్న మల్కని నిజాముని కభయంబొ
సంగితదీయ రాజ్యంబు నిలిపె.

(నరస 1-82)

బరీదుషాహాతో (వసు 1-51) చేసిన యుద్ధముగూడ అప్పటిదే.

రామరాయలు పొందిన యీ విజయములకు తిరుమలరాయఁడు గూడ హక్కుదారుఁడై నాఁడుకదా-

క. * * తరుణచరణ ఛా
గిబ్రామశరణ! (వసు 4-140).

అదిరొక సంప్రదాయము మాత్రమెయని గ్రహింపవలెను.

ఆ రెండు గ్రంథములలోను తల్లికోటయుద్ధప్రశంసగాని, రామరాజాదుల మరణముగాని లేదు. తిరుమలరాయఁడు 1555 లో ఒక కన్ను పోగొట్టుకొన్నాడు-

క. అన్నా! తిరుమలరాయా!
కన్నొక్కటిలేదుగాని కంతుఁడుగావే!
('కన్నొక్కటి కలదుగాని కౌరవపతివే!'
యని దాని పాఠాంతరము.)

అతఁడు ముఖ్యపట్టణము కుదురక భ్రమపడినాడు. అట్టి విషయము లేవియు పై రెండు కావ్యములలోఁ గనఁబడవు. (క్రీ. శ. 1680 ప్రాంతములో అందుగుల వెంకయకవి వ్రాసిన రామరాజీయప్రబంధములో తల్లికోటయుద్ధమునకు పిమ్మటి ఘటనలు కొన్ని పేర్కొనఁబడినవి.) వసుచరిత్ర, నరసభూపాలీయములలో వర్ణింపఁబడిన చారిత్రక ఘటనలు 1559 తో ఆగిపోయినవి. కాఁబట్టి యీ రెండు గ్రంథములును క్రీ. శ. 1560 లో సంతరింపఁబడినవని మాత్రమే యని కచ్చితముగాఁ జెప్పవచ్చును. అంతేకాని నరసభూపాలీయము తొలిరచనయనియు, వసుచరిత్ర యిరువదియేండ్లకు పిమ్మటి మలిరచనయు చెప్పెడిమాటలలో యిసుమంతయు సత్యములేదు. ఆరెండు గ్రంథములును ఏకకాలమందు ముగించుట యెట్లు సాధ్యమైనదో యిటుపిమ్మట తెలుపఁబడును.

తిరుమలరాయలు, వీరప్రతాప, రాజాధిరాజబిరుదములను, సదాశివరాయలు రాజ్యమునకు వచ్చినప్పటినుండియు ధరించుచున్నాడనియు, అతఁడు పెనుగొండకే పట్టాభిషేకమును పూర్వకాలమందె

1542-43 లో చేసుకొన్నాడనియు తలచక, ఆరెండంశములును 1565 కి పిమ్మట తిరుమలరాయలు అర్జించినవని తలచిన కొందఱు విమర్శకులు, వసుచరిత్ర రచనను 1565 కి తర్వాతకు గెంటివేసిరి. వారి యభిప్రాయముల నిక్కడ ప్రోగుచేసెదను. [14]వీరేశలింగకవి, వసుచరిత్రము క్రీ. శ. 1577 నకుఁ దరువాతనే ముగింపబడినట్లు స్పష్టమగుచున్నది యని పలికినాడు. [15]వజ్ఝలవారి యభిప్రాయముగూడ నదియె. వసుచరిత్రకుఁ [16]బీఠికను (1926) నిర్మించిన శేషాద్రిరమణ కవులు, ఆ ప్రబంధరచన 1577-80 మధ్యయని తీర్మానించిరి. దాని నాల్గవముద్రణకు పీఠికనుఁ గూర్చిన నిడదవోలు వెంకటరావుగారు 1569-70 లో పెనుగొండలో తిరుమలదేవరాయని పట్టాభిషేకము జరిగియుండుట చేత, వసుచరిత్ర రచన దానికి పిమ్మట నైనదనిరి. నేలటూరి వెంకటరమణయ్యగారు చెప్పిన దేమనగా- [17]తిరుమలదేవరాయలు 1570లో సింహాసన మెక్కి ఆ సంవత్సరమె మరణించినాడు. కాఁబట్టి యీ కృతి ప్రదానము 1570 అన్నారు [18]చాగంటి శేషయ్యగారు వసుచరిత్ర కృతి 1580 నాటిది యనిరి. వసుచరిత్ర, నరసభూపాలీయములలోని చారిత్రకఘటనలను గాక, లాంఛనవర్ణనల ననుసరించినచో, కాలనిర్ణయము సరిగా జరుగదనుటకు పై వారి యభిప్రాయములే నిదర్శనములు.

హరిశ్చంద్రనలోపాఖ్యానమునకు వ్యాఖ్యను వ్రాసిన చిత్రకవి అనంతకవి, దానిని కృతినొందిన గండికోటపాలకుఁడైన పెమ్మసాని చిన తిమ్మ భూపాలుఁడును, క్రీ. శ. 1575 ప్రాంతపువారు మాత్రమె. వ్యాఖ్యారచనాకాలమును సూక్ష్మముగా నిర్ణయించుటకు సాధనలు లేనందున, హరిశ్చంద్ర నలోపాఖ్యాన రచనాకాలమునుగూడ సూక్ష్మముగా స్థిరపఱచుటకు వీలుగాకున్నది.

---

14. ఆంధ్రకవుల చరిత్ర (కం. పీ. 1899) పు 267.
15. వసుచరిత్ర విమర్శనము (1915) పు 136.
16. వసుచరిత్రము (వావిళ్లముద్రణ 1965) పు 5, 18.
17. భారతి 1931 డిశంబరు, పు 929.
18. ఆంధ్రకవి తరంగిణి సం 10-144.

10. వసుచరిత్ర రచనాస్థలము.

అళియరామరాజు విజయనగరములోనె యుండినాడు. అతని యాస్థాన కవియైన రామరాజభూషణుఁడుగూడ నక్కడనె యుండినాఁడనవచ్చును గదా! ఆ కవిశ్రేష్ఠునినుండి రామరాజెన్నియో గ్రంథముల సంకితము పొందినాడని తిరుమలరాయలు చెప్పిన ఈ క్రింది మాటలనుండి గ్రహింపవచ్చును.

శా. శ్రీరామక్షితిపున్, మదగ్రజు, జయ
శ్రీలోలున్, నానాకళా
పారీణున్, బహు సంస్కృతాంధ్రకృతులన్
బల్మారు మెప్పించి (వసు 1-17).

అయితే ఆ గ్రంథములలో నివ్వాడొకటియు గానరాదు.

రామరాజు తమ్ముఁడును, పెనుగొండ సింహాసనాధ్యక్షుఁడునైన తిరుమలరాయలు గూడ నా కవినుండి యొక కావ్యము సంకితము పొందఁదలచినాడు.

ఎఱ్ఱాప్రగడ మహాకవి జీవితములోఁగూడ నట్టిఘట్టమె యుండినది. అతనిని మొదట మల్లారెడ్డి పోషించినాడు. పిమ్మట నతని యన్న యైన వేమారెడ్డి, ఎఱ్ఱాప్రగడను బిలిపించి రామకథ, హరివంశముల సంకితము గొన్నాడు. అట్టి ఘట్టము లింకను వాఙ్మయమున గలవు.

రామరాజభూషణుఁడు వసుచరిత్ర రచనను చిరకాలము క్రిందటనె మొదలుపెట్టెనని చెప్పవచ్చును. [19] తెనాలిరామలింగకవి 1550 ప్రాంతములో పాండురంగవిజయమును విరూరి వేదాద్రికి సంకిత మిచ్చెనని భావింపఁబడుచున్నది. దానిలో వసుచరిత్ర కథ యిట్లు తడవఁబడినది.

19. ఆంధ్రకవి తరంగిణి, సం 8 పు 25.

క. గిరికానుష క్తబుద్ధి ను
పరిచరునింబోలు నొక పన్నగ మొక నా
డురువడి నెచ్చటినుండిరొ
మురమర్దను దివ్యభవనమున కేతెంచెన్.

అట్లు తెనాలిరామలింగని చెవిలో రామరాజభూషణుని ప్రయత్నము పడినది. కాఁబట్టి వసుచరిత్రరచన 1550 ప్రాంతమునకె ప్రారంభింపబడి, సుమారు పదేండ్లకాలము పరిశ్రమ చేయఁబడినదనవచ్చును. అది ముగిసిన విషయము నెఱిగిన తిరుమలదేవరాయలు అన్నగారి అనుమతితో, కవికి కబురంపినాడని యూహింపవచ్చును. వసుచరిత్ర రచన విజయనగరములోనె జరిగినను, కృతిప్రదానమైనను పెనుగొండలో తిరుమలరాయల సమక్షమున జరిగినదని చెప్పలేము. రాజధానిలో జరిగియుండవచ్చును! అట్లు కృతికర్త, కృతిపతులు ధన్యులైరి.

11. వసుచరిత్ర, నరసభూపాలీయములు.

వసుచరిత్ర, నరసభూపాలీయములయొక్క యవతారికాదులను బరిశీలించి, వానిలోని యతినవీనచారిత్రకాంశము క్రీ. శ. 1559 నాటిదని తెలుసుకొంటిమి. కాఁబట్టి యీ రెండు గ్రంథములునుగూడ నేక కాలముననె తయారైనవని చెప్పితిమి. ఆ రెండింటి శైలియు నొకే విధముగా నున్నదని కొందఱనుచున్నారు. కాఁబట్టి శైలిని బరీక్షించెదము. వసుచరిత్ర ముఖ్యముగా వ్యంగ్య, శ్లేషలుగల రచన. పదములలో సంగీతమాధుర్యము జాలువారుచుండును. నరసభూపాలీయశైలి భిన్నమైనది. దానిలో శ్లేషకోసము పాట్లులేవు; శ్లేషసకృత్తు; సాదా శైలి, గంభీరముగా నుండును. శబ్దములలో సంగీతముకోసము వెతకులాట లేదు. వసుచరిత్ర కవికి చిన్న తెలుఁగుపదములన్న నిష్టము. కాని శ్లేషవలన రచన నారికేళపాకములుగా నుండును. దానికి వ్యతిరేకముగా నుండును రెండవకవిశైలి; తత్సమపదములమీఱ (నరస

1-13) పీఠిక, వసుచరిత్రకవికి వర్గాంతాక్షరములు, ముఖ్యముగా నకారమన్న యిష్టము. ఈ క్రింది పద్యములలో నెన్ని నకారములు, సున్న లున్నవో చూడండి.

శా. నానాగాయన గాయనీమణులగా
నంబుర్వినాలింపమో,
నానాటం నగభేదిపీటగలగం
ధర్వాప్సరోగీత వి
ద్యానైపుణ్యము లెన్నిమేని వినమో,
యందైన నిందైన విం
దైనాఁడంబొనఘూర్చునే మదికి ని
ట్లానంద సందోహమున్ (వసు 2-16)

ఈ నకారప్రియత్వమువల్లనే కాఁబోలు, అతఁడు 'నానానూనవితాన' మను ముక్క, పద్యమును ముక్కతిమ్మనదగ్గఱ కొన్నాడను వదంతి పుట్టినది.

ఆ రెండు కావ్యముల గద్యములనుండియు ఆ కవుల వ్యక్తిత్వములు తెలియక పోలేదు. రామరాయభూషణుఁడు చతుర్విధకవితలలోను, సాహిత్యరసపోషణలోను ప్రవీణుఁడు. మూర్తి కవి నిరుపమావధాని, సకలభాషావేత్త. అట్లు వారి పాండిత్యములో భేదమున్నది. ఒకఁడు రసవద్గ్రంథకవి, రెండవవాడు శాస్త్రకవి.

ఒకే వ్యక్తి రెండు భిన్నశైలులలో రచనను సాగింపగలడనుట సబబుకాదు. భిన్నవ్యక్తుల నుండియే భిన్నశైలులు పుట్టును. ఒకే కవి భిన్నకాలములలో భిన్నశైలులను సృష్టింపగల డనవచ్చును. కాని దానికిఁగూడ వీలు లేదు. ఏలనన ఆ రెండు కావ్యములును ఏకకాలములో సంతరింపబడినవి మాత్రమే. కాఁబట్టి వసుచరిత్ర కవి యొకఁడు, నరసభూపాలీయ కవి వేఱొకఁడును, అట్లు వారిద్దఱును వేర్వేఱు వ్యక్తులు

మాత్రమె. ఆవిధము వారు భిన్నులని వాదించిన ఇటీవలివారిలో ముఖ్యులు [20]గురుజాడ శ్రీరామమూర్తి, పూండ్ల రామకృష్ణయ్య గార్లు.

### 12. వాఙ్మయములో వారి పేర్లు.

రామరాజ భూషణుని సొంతపేరు మనకు తెలియలేదు. అంతే కాదు. తర్వాతివారు అతనిని మూర్తికవియని సంబోధించిన యెడల, రామరాజభూషణుని యసలు పేరు మూర్తికవి యగునుకదా! అంతట నిస్సందేహముగా నరసభూపాలీయ కర్తగూడ నతఁడే యగును. ఇంక వారి తండ్రి పేరులోఁగూడ తఖరుండదు- నరసరాజు అసలు పేరు కాగా, వేంకటరాయభూషణుఁడనునది బిరుదనామమగును. ఆవిధముగా మూఁడుకావ్యముల కర్తయొక్క కవే యగును, కాని యిద్దఱు కారని రుజువగును. కాఁబట్టి వాఙ్మయములో నా యిద్దఱికవుల పేర్లెట్లున్నవో చూచెదము.[21]

1. 1550 ప్రాంతపువాఁడైన తెనాలిరామలింగకవి-

అల్లసాని పెద్దన్న యటునిటు నేడ్చె
ముక్కుతిమ్మన్న ముద్దుముద్దుగా నేడ్చె
బట్టుమూర్తి బావురని యేడ్చె.

నని వసుచరిత్రకర్తనుగుఱించి చెప్పినాడు.

2. 1575 ప్రాంతపుదైన లక్షణదీపిక యను గ్రంథములో 416వ పద్యములో, బట్టుమూర్తి వసుచరిత్రకర్తయని వక్కాణింపఁబడెను.

---

20. గురుజాడ శ్రీరామమూర్తిగారు (1851-1899) కవిజీవితములను వ్రాసిరి. రాజయోగి పత్రికను బ్రకటించిరి.

పూండ్ల రామకృష్ణయ్యగారు (1860-1904) ఆంధ్రగ్రంథచింతామణి యను ప్రముఖపత్రికకు అధిపతి. అనేక ప్రబంధముల నచ్చొత్తించిరి.

21. ఈయఁబడిన ఉదాహరణలలోఁ గొన్ని ఆంధ్రకవుల చరిత్ర, వసుచరిత్ర విమర్శనము, ఆంధ్రకవితరంగిణులలో నున్నవి.

3. మండ లక్ష్మీనరసింహాచార్యులు (1675) అల్లసాని పెద్దన్న శిష్యుఁడైన బట్టుమూర్తియని వసుచరిత్ర కర్తను గుఱించి చెప్పినాఁడు.

4. 1750 ప్రాంతమున వసుచరిత్ర వ్యాఖ్యాతయైన సోమకవి 'కారణజన్ముఁడై కవిని కాయము మెచ్చగ......బట్టుమూర్తియై' యని పలికినాడు.

ఆ యుదాహరణములనుండి రామరాజభూషణుని తొలిపేరు బట్టుమూర్తియని తేలుచున్నది. అయితే కొందఱు కవులు అతనిని వట్టి 'మూర్తి' యను పదమునఁగూడ బిల్చిరి. కాని దాని విషయమై యెంత జాగ్రత్తగా నుండిరో పరిశీలించెదము.

1. తెనాలిరామలింగకవి యొక్క చాటువులో,

అతి శ్లేషశబ్ద వాగాడంబరంబొప్పఁ
బకఘటించెనుమూర్తి వసుచరిత్ర.

యని విమర్శించినాడు.

2. పైనఁజెప్పిన సోమనాథ వ్యాఖ్యాతయే మూర్తియను పదము నుచ్చరించి పిదప వసుచరిత్రయని పేర్కొన్నాడు.

3. సురభిమాధవరాయ కవిని (1600 ప్రాంతము) గుఱించి యున్న చాటువులో-

చ. సురభికులాబ్ధియందు బొడసూపిన మాధవరాయ చంద్రికా
సరసపదార్థ రంజనము, సత్కవిహృన్యముగాఁ జంద్రికా
పరిణయమున్ రచించె, నది భావ్యము, నీవసుచర్య చూడగా
బరఁగె నిగూఢవృత్తి, నటువర్తిలె నీకును మూర్తినామమున్.

పై యుదాహరణలను మనము జాగ్రత్తగా గమనింపవలెను. అందులోనే యుదాహరణమునందును మూర్తినామము విడిగాలేక వసుచరిత్ర కావ్యము పేరుతోఁగూడ నున్నది. అది బహుప్రధానము. ఏలనన, మూర్తియనుటతోడనే నరసభూపాలీయమును వ్రాసిన

మూర్తికవి యగును. కాఁబట్టి వారు అట్టి పొరపాటును చేయకుండ నుండవలెనని మూర్తి శబ్దముతో పాటు అతని గ్రంథనామమునుగూడ జతపఱచిరి. అట్లుచేసిన నెట్టి సందిగ్ధమునకును తావుండదుగదా! కాఁబట్టి జాగ్రత్తగా వాడిరని గ్రహింపవచ్చును. ఆ విధముగా బట్టుమూర్తి యొకఁడు, మూర్తికవి మఱియొకఁడని స్థిరమగుచున్నది.

నరసభూపాలీయ కృతిపతివంశములోనె మూర్తి (ఆ 1-65)అను పేరుగల రాజున్నాడు. ప్రబంధాంకమువారు ఆ రాజవంశస్తుల నాశ్రయించుకొన్నవారై యా రాజుల పేళ్లను పెట్టుకొనుచుండిరని చెప్పవచ్చును.

బట్టుమూర్తి యను పేరులో కులప్రశంసకూడ నున్నది. అది బ్రాహ్మణులలో బాపనశాస్త్రి అను పేరు వంటిది. బట్టుమూర్తిలో బట్టు అను పదమును విడతీసి వాడినయెడల గజిబిజిపుట్టును- వసుచరిత్ర కర్తగాక, నరసభూపాలీయ కర్తను గుఱించి చెప్పుచున్నామని నిర్ణయమగునుకదా!

ఇప్పుడా పేరును నిర్లక్ష్యముగా వాడి తన యవిమర్శకత్వమును బ్రకటించుకొన్న మొదటి ప్రయోగకర్తను కనుగొనెదము.

అయ్యలరాజు రామభద్రకవి యష్టదిగ్గజములలో నొకఁడు. అతఁడు వ్రాసిన ఒక పద్యములో షడ్జమస్వరమును విని పాములు పారిపోయినవను భావమును ప్రకటించెను. పాములు గానప్రియములు కాగా ఎట్లు పారిపోయినవని నరసభూపాలీయ కర్త యాక్షేపించినాడు. షడ్జమస్వరము నెమలిదియగుటచేత పాములు పారిపోయినవని రామభద్రుఁ డుత్తరమిచ్చెను. ఆ కవులు వేసుకొన్న పందెముప్రకారము నరసభూపాలీయ కర్త తలఁదన్నఁబడి యవమానింపఁబడినాడు. అట్లు మూర్తికవి యవమానింపఁబడినవాఁడై యుండగా, రామరాజభూషణుఁడు (బట్టుమూర్తి) అవమానింపఁబడెనని అప్పకవి అప్పకవీయములో (1-27) వ్రాసినాడు. మూర్తికవి వేఱు, బట్టుమూర్తి వేఱు అను

సంగతి నెఱుగక అప్పకవి తన యజ్ఞానమును బ్రకటించుకొన్నాడు. ఆ యిద్దఱు కవులు నొక్కరే యను అభేరవాదమునకు, అవిచార మూలకముగా అప్పకవి పునాదిరాయిని వేసినాడు. ఆ తప్పుదారియే తర్వాతి కొందఱకు రహదారియైనది. 1829 లో [22]దక్కన్ కవుల చరిత్రను ఆంగ్లములో వ్రాసిన కావలి వెంకటరామస్వామి, నరస భూపాలీయమును వసుచరిత్రకారుఁడైన బట్టుమూర్తి వ్రాసినాడను తప్పువ్రాత వ్రాసినాడు. 1840 ప్రాంతములో సి. పి. బ్రౌన్ ఆజ్ఞనను సరించి [23]ములుపాక బుచ్చయశాస్త్రి వసుచరిత్ర వ్యాఖ్యను నిర్మిం చుచు, శారదామూర్తియగు మూర్తికవి వసుచరిత్ర కర్త యని పేర్కొన్నాడు. వీరేశలింగకవి (1899) మఱికొందఱును ఆ తప్పు త్రోవలోనె నడిచినారు. ఆ తప్పుత్రోవనుండి మళ్ళింపఁ బ్రయత్నించిన వారు గురుజాడ శ్రీరామమూర్తి, పూండ్ల రామకృష్ణయ్యగార్లు.

## 13. ఇద్దఱు కవులు.

వసుచరిత్ర ప్రబంధము తిరుమల దేవరాయలకు అంకితమీయఁ బడగా, నరసభూపాలీయము పోచిరాజు నరసరాజునకు కృతినీయఁ బడినదికదా! రామరాజభూషణుఁడు హరిశ్చంద్రనలోపాఖ్యాన మను ద్వ్యర్థి కావ్యములో తాను వసుచరిత్రకర్తనని చెప్పుకొన్నాడు. కాఁబట్టి యాతఁడు రెండు పుస్తకములలోను తనను గుఱించి చెప్పుకొన్న విష యములను గమనింపవచ్చును.

వసుచరిత్ర (1-17) నుండి కవిపేరు రామరాజభూషణకవి యనియు, రామరాజుయొక్క యాస్థానమునందలివాఁడనియు, పెక్కు కావ్యములను సంతరించినవాఁడనియుఁ దెలియుచున్నది. ఆ కవి రామ భక్తుఁడు. హనుమంతునివరమున కవిత్వమును గాంచెను; చతుర్విధ కవితల నెఱిఁగినవాఁడు అని గద్యమునుండి విశదమగుచున్నది. ఆ కవి

22. వసుచరిత్ర (వావిళ్ల ముద్రిత 1965) పీఠికయొక్క అనుబంధము 3.
23. డిటో డిటో పీఠిక, పుట 24.

సొంత పేరు చెప్పఁబడ లేదు; రామరాజభూషణుఁడనునది బిరుదనామము మాత్రమె. అతని రెండవప్రబంధమైన హరిశ్చంద్రనలోపాఖ్యానము నుండి కొన్నిసంగతులు తెలియుచున్నవి. (హ. న. 1-46). కవికి రామరాజభూషణుఁడను శుభచిహ్నమును రామరాజిచ్చినాఁడు. వెంకటేశ్వరుని యనుగ్రహమువల్ల ఆ కవి యైశ్వర్యవంతుఁడైనాఁడు. ఇక్కడ వెంకటేశ్వరుఁడను పేరును తిరుమలరాయనికి పర్యాయపదముగా వాడినాఁడు; శ్లేష లేకపోలేదు. అతని యింటిపేరు ప్రబంధాంకమువారు. అదియు ఒకనాఁడు బిరుదేకాని మరియొకటికాదు. అతని తాతపేరు సింగరాజు తిమ్మరాజు, తండ్రి సూరపరాజు. వసుచరిత్ర, హరిశ్చంద్రనలోపాఖ్యానముల గద్య లొక్కలాగున్నవి. వసుచరిత్ర 1560 లోను, హరిశ్చంద్రనలోపాఖ్యానము 1568 లోను ముగిసి యుండును. ఆ రెండు పుస్తకములలోను అసలుపేరుగాక బిరుదునే అసలుపేరువలె చెప్పుకొన్నాఁడు.

ఇంక నరసభూపాలీయములోని విషయములను జూచెదము. మూర్తికవియొక్క చరిత్ర (1-13) యిట్లున్నది. ఇంటిపేరు ప్రబంధాంకమువారు. తాత సింగరాజు తిమ్మరాజు, తండ్రి వేంకటరాయభూషణుఁడు. తన తండ్రిపేరునకు ముందుగా సరసయను విశేషణమును జేర్చినాఁడు. అట్లె తన పేరునకు ముందుగా శుభయను విశేషణమును గూడ చేర్చి చెప్పుకొన్నాఁడు. గద్యములో తాను హనుమద్భక్తుఁడు, తనపేరు మూర్తికవి, తన బిరుదు శారదామూర్తి యని వ్రాసుకొన్నాఁడు. నరసభూపాలీయములోని చక్రబంధమందలి (4-88) ఆఱవ వలయములో తనపేరు మూర్తికవియని తెలుపుకొన్నాఁడు.

ఆ యిద్దఱు కవులును మహాపండితులు, మహాకవులును. వారిద్దఱును తమ పాండిత్యము, కవిత్వమును గుఱించి వ్రాసుకొనునప్పుడు వీలయినంతమట్టుకు వేర్వేరుపదములను వాడినట్లుగాఁ దోచుచున్నది. అప్పుడు ఇద్దఱును ఒక్కరేయని పొరపాటు పడముకదా!

సోమ:-మీా రీపాటింతమున లేనటు లున్నదే-

పతం:-ఔ నోయి! లేను. ఈ నారాశ భద్రాచలమునుండియే.

సోమ:-ఇంకను మీా చెవి నీ శుభవార్త పడనేలే దనుమాట! ఔను. ఆశ్చర్యము లేదు. ఈ కందారపురమున నా చివరియుండ్లవారే యెఱుగ రాంధ్రరాజ్య మాంధ్రరాజపుత్రుని యధీన మైనదని.

పత:-(ఆశ్చర్యముగ) ఆఁ ఏమి. ఎపుడు నాయనా! మన మాధవశర్మ గారివశ మైనదా? ఇంత యవలీలగ- పోరాట మావంతయైన లేకుండగనే...

సోమ:-ఇచట మన కెదురు తిరుగువా రున్నగదా! పోరునకు మాధవ శర్మగా రింతకుమున్నే వీరుల బ్రోవుచేసి యుంచినారు. కుమార మాధవవర్మగారు గంటము చేబూని యాంధ్రుల కావేశము గల్పించి స్వరాజ్యాభిలాష రేకెత్తించినారు. బల్లహోద్యోగులగు నాంధ్రుల గలసికొని రహస్యాలోచనముల సాగించి "ఊఁ" యని పించినారు, సర్వసేనాని కుమారవర్మగారు తమ సైన్యమునెల్ల నాంధ్రరాజతనయుని యధీనము గావించినారు. ఒక్కమారుగ భీషణవర్మపరివారము స్తంభనసూత్ర మవలంబించినది.

పతం:-(ఆశ్చర్యముతో) అబ్బా! ఎంత యనాయాసముగ జరిగినది.

సోమ:-నేటియుదయమున శ్రీవృద్ధమాధవశర్మగారుంచిన సుముహూర్త సమయమున శ్రీకుమారమాధవులు సాయుధు లగు పదుగురువీరుల వెంటగొని యంతఃపుర మాక్రమించికొనినారు. ఓఢ్రదేశీయో ద్యోగు లెల్లరు బంధింపబడి వారిపదవుల నాంధ్రు లాక్రమించి నారు. అంతయు నరగడియలో నింద్రజాలమువలె నిట్టే పూర్తి యైనది.

పతం:-భీషణవర్మ సకుటుంబముగ జిక్కెననుమాట.

సోమ:-లేదు. అటులుమాత్రము జరుగలేదు. అల్లునితో బాటుగ వియ్యంకునిగూడ నిన్నటిరేయి కుమారవర్మగారు కటకపురమునకు సరహస్యముగ బంపియే యున్నారు.

పతం:-కుమారవర్మగారు మనపక్షమే కైకొని రని యంటివే. అటు లేల శత్రువును దప్పించిరి?

సోమ:-పూర్వబాంధవ్య మెంతగ దెగినను నామాత్రము పక్షపాతము లేకపోవునా?

పతం-బంధుత్వము తెగిపోయినదా? ఆనిర్భాగ్యుడు కుమారవర్మగారి కుమార్తెను విడిచిపెట్టినాడా యేమి?

సోమ:-లేదు. ఆత్మహత్య గావించుకొని యామెయే కుటుంబయుగళి వీడి పరలోకగామిని యైనది పాపము!

పతం:-అయ్యో! శివశివా!

సోమ:-మనము విచారింపవలసిన పనిలేదు. ఆమె కష్టములు గట్టెక్కినవి. ఆఁ మఱచితిని. మన సభాపతిగారు నన్ను బిలువబంచినారు. నేను త్వరితగతి కోటలోని కేగవలసియున్నది. నేటి నాటకప్రదర్శన సమయమున మనము మఱల కోటలో గలిసికొందుము. సెల వొసంగుడు.

పతం:-కోటలో నాటకప్రదర్శనమా?

సోమ:-ఔను. 'కుమారమాధవ' మనునాటకము నేడు మన యుగ్రిహారవాసులచేతనే ప్రదర్శింపబడనున్నది. అనుమకొండ ముడికొండప్రభువు లిటకు దయచేయనున్నారు. ఆంధ్రవీరుల కెల్ల బత్త్యేకాహ్వానపత్రము లంపబడినవి. పౌరులెల్ల రే తెంచి వీక్షింపవలె నని చాటబనిచినారు.

పతం:-ఆంధ్రరాజ్యపునస్థాపనదిన మిది. ఆ యానందము సూచించుటకే యీ ప్రదర్శన మనుకొందును.

సోమ-ఇంతేకాదు దీనివలన ప్రత్యేకప్రయోజనము గల దని మన సభాపతిగారు మధుసూదనవర్మగారితో ననుచుండ నే నాలకించితిని.

పతం:-కుమారమాధవ" మనగా మన భర్తృదారకుని వారిత్రిమే కాదా ?

సోమ:-కావచ్చును. తినబోవుచు రుచి నడుగు టెందులకు ?

పతం:-నాయనా! నీకు కాలహరణము గావించితిని- రాత్రి య చట గలిసికొందము. నీవు వెడలిరమ్ము,

( ఇరువురును నిష్క్రమింతురు. )



# ఆంధ్రదీక్ష

## చతుర్థాంకము - ద్వితీయ రంగము

ప్రదేశము:-కందారపురాంతః పురాంతర్భాగము.

ప్రవేశము:-పౌరులు కూర్చుండియుందురు.

( ప్రతాపవర్మ నాటకరంగస్థలి నిల్చి)

ప్రతా:-ఆంధ్రదేశాభిమాను లగు మహాశయులారా! గత పంచవింశతి వత్సరములలో నాంధ్రరాజ్యమున జరిగిన విశేషములు మీకు దెల్పుటకే మన నవీనాంధ్రసార్వభౌము లీ"కుమార మాధవనాటకము బ్రదర్శింప నాజ్ఞాపించియున్నారు. ఆంధ్రదేశీయుల భావి కర్తవ్యమును శ్రీ ప్రభువువారే నాటకాంతమున నాన తిచ్చెదరు. శ్రద్ధగ నవలోకింప బ్రార్థితులు. (వేదిక దిగును.)

కరతాళధ్వనులు "జయ ఆంధ్రదేశమాతః !"

- అంతర్నాటకారంభము -

( తెర నెత్తగ )

ప్రదేశము:-అనుమకొండమార్గము.

ప్రవేశము:-(గిరిక బుజమున కరమాని సోమనాథభూపతిచిత్రఫలక మక్కున జేర్చుకొని గర్భవతి సిరియాళదేవి)

సిరి:-

సీ. ఏ సభాంగణమునం దిటుపైన నర్తించు
త్రైలోక్యవాగ్దేవతామతల్లి
ఏ దేవళంబునం దిక గాపురించును
సకుటుంబముగ బాలచంద్రమౌళి
ఏ కోటబురుజుపై నిటుమీఁద మార్మ్రోయు
దండయాత్రాసూచిచండభేరి
ఏ హజారంబునం దిక విరాజిలు నాంధ్ర
జాతీయశిల్పవిజ్ఞానలీల

తే. గీ. తావు లే దింక సోమదేవావనీంద్రు
తోడ నా నీ యదృష్టంబు తొలగిపోయె
ధారుణీగర్భమున తల దాచుకొనఁగ
రమ్ము కందారపురమ! నిర్భాగ్యురాల!

గిరిక:-అంతయు దైవాధీనము. దానిపైననే భారముంచి కొంచె మోపికపట్టుము తల్లీ!

సిరి:-(కన్నీరు గార్చుచు) అయ్యో! గిరికా! నీకంటె బల్లహుడే నాకు పరమోపకారి సుమా! కృపాసముద్రుఁడగు నా మహానుభావుడు నా నాథుని సంహరించి యాతని సహగమనభాగ్యము నాకు జేకూర్ప యత్నించినాడు. నీవో- ఆతనినుండి నీవు విరమింపజేసి నన్ను జీవచ్ఛవమునుగా భూమిపై నుండు మనుచుంటివి.

గిరి:-అమ్మా! ఊరడిల్లుము, అయ్యో! ఎంతచెప్పినను మానవేమి? తల్లీ! తల్లీ! ఆ మాటలు బాదుకొనకుము. గర్భమునకు బ్రమాదము సుమీ. మానవా? తల్లీ! మానవా? నా మాట వినవా?

సిరి:-(గద్గదకంఠమున) గిరికా! గిరికా!! ఏ ముహూర్తమున నీ పాడు గర్భము దాల్చితినో. యీ మహావీరుని- యీ దీనజనబాంధవుని- నా సుగుణఖనిని- (ఆయాసముతో) ఆ- ఆ నా జీ వి తే శ్వ రు ని పొట్టను బెట్టుకొనినది.

గిరి:-అమ్మా! అటు చూడుము. భగవాను డగు సిద్ధేశ్వరుని పవిత్రదేవాలయశిఖర మా కొండ చెంత గాన్పించుచున్నది. చేతు లెత్తి యొకపరి నమస్కరింపుము.

సిరి:-(చేతుల జోడించి) దేవా! నీవు దయామయుడ వందురే! ఆశ్రితపక్షపాతి వందురే- మా సేవలలో నేమైన లోపము గల్గినదా? తండ్రీ! నానాథునిపై నీ కేల కరుణ లేకపోయినది?

ఉ. కాయముచే మనోగతిని కర్మముచేతను వాక్కుచేత ని
న్నాయతభక్తి గొల్చునమలాత్ముని సంతతదానశీలరా
ధేయుని నీదు భక్తుని మదించి దురాత్ముడు బల్లహుం డయో
వ్రేయుచునుండ కన్నులను విందుగ జూచుచు మిన్నకుంటివే?

అయ్యో! పరాత్పరా! నిన్ననసేల? మా పూర్వజన్మఫలము తండ్రీ! నీ వేమిచేయుదువు. నీవు తటస్థుడవే.

గిరి:-అమ్మా! కంఠమున విషము బెట్టుకొనినవానికి గనికర మేమి? కలలోనిమాట.

సిరి:-అయ్యో! ఎంతమాటాడితివే గిరికా! భగవాను నట్లనవచ్చునటే- (ఆయాసముతో) ఇంక నెంతసేపే.

గిరి:-అమ్మా! సమీపించుచున్నాము. ఆ మామిడితోట యొద్దగ నుంటచే పురము గాన్పించుట లేదు.

సిరి:-ఏ పురమే ?

గిరి:-అనుమకొండపురము.

సిరి:-అది యెవ్వ తెకు గావలయును? నే నీ కెంతకాలము జీవింపవలయు వని యడుగుచుంటిని. నా నాథు డీసరి కెంతద వ్వరిగి యుండునే.

గిరి:-అమ్మా! ఆత్మహత్య మహాపాతకము గాదా? సర్వధర్మము లెఱిం గిన నీ వట్టిపనికి సాహసింపనగునా ?

సిరి:-వెఱ్ఱిదానా? సహగమనము భారతనారీమణులకు సహజాచారము గాదటే.

గిరి:-అగు నమ్మా! కాని భ్రూణహత్యాదోష మిందు కలదుగదా?

సిరి:-అటులైన నే నిపు డేమి చేయవలయునే గిరికా!

గిరి:-పీగమాత వై - బల్లహునిపై బగ దీర్చుకొని పరలోకగతు లగు మహారాజున కానందము గూర్పు మనుచుంటిని.

సిరి:-(క్రోధకంపితస్వరమున) బల్లహపిశాచమా!

ఉ. శ్రీలలితాసతీధవుని సేవల బొల్చినసోమదేవభూ
పాలుని పాదపద్మముల బాయక కొల్చినదాన నేని నే
బాలుని గాంచి నిన్ను బలవంతముగా వధియింప జేసి నీ
యాలును బిడ్డ లీకరణి నారడి నందుట జూడకుందునే.

అయ్యో! గిరికా! ఏమి చేసినను నా హృదయేశ్వరుడు తిరిగి రాడు గదా! (తల పంకించి) నడువుము. ప్రతిజ్ఞాపాలనమునకు ప్రాణ రక్షణ మావశ్యకము గదా ( రెం డడుగులు నడిచి తిరిగి చూచి ) ఓ కందారపురవాసులారా !

సీ. ద్విజులార! పరమసాత్వికులార! మీ కగ్ర
హారంబు లింక నే యనఘు డిచ్చు ?
ధర్మాత్ము లైన బాంధవులార! మిమ్ముల
ననుజులగతి నెవ్వ రాదరింతురు ?

ఘనులార! ఆంధ్రిసత్కవులార! మీ కురు
గౌరవ మింక నేఘను డొనర్చు?
ఆంధ్రిదేశీయగాయకులార! యిం కెవ్వ
రోకో! మీకు బారితోషిక మొసంగు?
తే. గీ. లలితగుణు లైన సేవకులార! రాజ
సేవ మీ కింక నేటితో చెల్లిపోమె
నక్కటా! మీకు గాసిపింప డొక్కపరియు
భవ్యమతి సోమదేవభూపాలు డింక.

నేనుమాత్ర మటు నా కాంతునితో నేగజాలక- యిటు నాసంతాన మగుమిమ్ముల జూచుకొనుచు నిట నుంటకైనను నోచుకొనక నిర వలంబముగ మతిమాలి తిరుగుచుంటిని.

సిరి:-(ఆగి) ఆగవే! గిరికా! ఆగవే! నేను కందారనగరసీమ దాటి యెక్కడనుగైనను ముందునకు వేయ నిచ్ఛగింపనే- నే నికెంత కాలమో జీవింతు ననునమ్మకము లేదు. నా ప్రాణకాంతుని కరములలో సువాసిని నై యసువుల బాయునదృష్టము లేకపోయినను- నా యీ భూమిలో- నా తెనుగు నేలలో- నా యాంధ్రిజనుల చేతులలోనైనను పిడికెడుబూడిద గాకూడదా?

అయ్యో! నా యొడలు కంప మెత్తుచున్నది. నా కనులు చీకటులు గ్రిమ్ముచున్నవి. ఆః ఆః ప్రపంచమే లేదే గిరికా! హాః హాః (మూర్ఛిల్లును.)

గిరి:-(ఆతురతతో బట్టుకొని) అయ్యో! అయ్యో! ఇచట నొంటరిగ నే నేమి చేయుగలను? (చూచి) తల్లీ! తల్లీ! కలకలలాడు నీముద్దుమొగ మెంత కళదప్పి యున్నది. పదరాజీవము లెంతగ గంది పోయినవి. (విసరుచు) అమ్మా! అమ్మా! తెలివి రాకున్నదే! నా కనులు మాడిపోవ! ఎట్లీదురవస్థను జూడగలను? (చూచి) ఆదెగో ఇంచుక కదలుచున్నది. దేవీ!

సిరి:-(కనుల దెఱచి) ఏమే గిరికా! మన మిప్పు డెచట నుంటిమే?

గిరి:-అనుమకొండసమీపమున- కాని తల్లీ! నీ శరీరము నిపు డెట్లున్నది?

సిరి:-(నిట్టూర్చి) ఇంక స్వస్థతగా కేమున్నదే? దీనికేమి గాని ఏదీ' గిరికా! ఒకసారి దరిసింపనిమ్ము. ఎచటనున్నదే చిత్రఫలకము?

గిరి:-(సమీపస్థ మగుదాని దీసి చేతి కొసంగి) దేవీ! దేవీ! మన మిట దడయుట ప్రమాదకరము. వడిగ ననుమకొండ జేరి యేరిచేనైనను రక్షణ మందవలయును. ఎచటి కేగుదమమ్మా!

సిరి:-ఈ నగరపాలకులగు నెఱుక దేవరాజుగారి కడకు గాని- దయాళు రగు నేద్విజశేఖరుల చెంతకుగాని...

గిరి:-అమ్మా! ఎంతటి యమాయినివి! శరీరసేనాబలములు లేనిబాడ బులా మనల రక్షించువారలు?

సిరి:-అటు లనవలదే- బ్రహ్మబలమే బలము. వారుగాక యన్యు లేరును సమర్థులు గారని నా మానస మేలనో బోధించుచున్నది. ఐనను ప్రాణసఖి వగు నీపల్కుల నిరాకరింపదగదు- పదవే.

(ఇద్దరు నిష్క్రమింతురు.)



# ఆంధ్రదీక్ష

## చతుర్థాంకము—తృతీయ రంగము.

ప్రదేశము:-కందారపుర బాహ్యసీమ నొక పటకుటీరమున రాత్రి.

ప్రవేశము:-బల్లహుడు; మంత్రులు భీమణవర్మ, ప్రభాకరవర్మ.

బల్ల:-ఔను ప్రభాకరా! ఆంధ్రవీరు లాహవమునుండి తొలగిరే కాని వీరస్వర్గ మలంకరింపలేదు.

ప్రభా:-వారు రాజభక్తిపరిపూర్ణులు- దేశాభిమానులు- ఒకవంక మనము ప్రజాకర్షణకై ప్రయత్నించుచుండ వారు వారింప యత్నింతురు. ప్రజల యభిమాన మాంధ్రదేశము దెసకే మలుచూపును. కావున సామదానోపాయములచే దొలుత నాంధ్రవీరుల వశ మొనర్చుకొనదగును.

భీమ:-(వికటముగ నగుచు) ఎంత స్వవచోవ్యాఘాతము! మన కృతి మాదరణములకు- మన గౌరవోద్యోగములకు మన బిరుదప్రదానములకును నాంధ్రవీరు లాస జెందరని మీారే వారి వివేకము నుగ్గడించిరి కాదా?

ప్రభా:-కపటగతి నెవ్వ రాదరింపు మనిరి? ఇవు డాంధ్రదేశము మనదే. కావున నాంధ్రులగూడ మన యోధులతో సమముగ నాదరింపవలదా?

బల్ల:-(భీమణునితో) మన ప్రభాకరునిపలుకు ప్రాణవంతము.

భీమ:-ప్రభూ! అటులైన నేటిసంగరమున గొందరాంధ్రవీరులు మనకు జిక్కి యీా సమీాపముననే బంధింపబడి యున్నారు- ఆజ్ఞ యగు నెడల...

బల్ల:-బాగుగ నున్నది. మనప్రభాకరు లేగి వారి నిటకు సగౌరవముగ దోడ్కొని రాగలరు.

ప్రభా:-చిత్తము. (నిష్క్రమించును.)

బల్ల:-అడుగ మఱచితిని భీమణామాత్యా! సోమదేవుని యంతఃపుర మన్నిదెసల గట్టిగ కావలి యుంపబడినదా?

భీమ:-చిత్తము. ఇది మఱువదగినవిషయమా? ప్రభూ! రాజపత్ని సిరియాళదేవి నేమిసేయు మని మీ యానతి?

బల్ల:-ఆమెతో మనకు ప్రసక్తి యేమి? పుట్టినింటి కామెను సగౌరవముగ బంపివేయుదము.

భీమ:-ఆహా! దేవర యెంత దయామయులు! కరుణ కార్యాకార్యవివేచనమును మరపించునంతటి బలవత్తర మైనది. రాణి గర్భవతి. ఆమెకు పురుషసంతానము గల్గినచో ప్రభుసుతు గాంచి ప్రజలలో ప్రజానాయకులలో నాంధ్రదేశీయాభిమానము మఱల జనించి విద్యుచ్ఛక్తివలె ప్రతిరక్తనాళమునను వ్యాపించి విజృంభించి యెల్లర నావేశపూరితుల నొనరింపకుండునా?

బల్ల:-(సాలోచనుడై) ఔను- ఆంధ్రుల యంతరంగము లట్టివే- నీ మాటలు కాదనరాదు. పోనిమ్ము. ఆమె ప్రసవించినపిదప బాలుడే యైన నాతని వధించి శత్రుశేషము లేకుండ జేసికొని యపు డామెను విడమట దగునేమో- ఏమందువు?

భీమ:-కాని- మహాప్రభూ! సోమదేవునిపైకంటె రాజమహిషిపై నాంధ్రుల కధికభక్తి యని వింటిని. నిశ్శేషముగ నా కుటుంబ మిపుడే యంతరించినగాని ప్రజలు మన పరిపాలన మంగీకరింపరు.

బల్ల:-ఆగుము- వారెవో వీరులతో మనమంత్రి వచ్చుచున్నాడు. మనము చక్కగ ప్రసంగింపనగును.

(ప్రభాకరు డిరువురువీరులతో ప్రవేశించును.)

బల్ల:-(చూచుచు) వీరపుంగవులారా! ఆ యాసనము లలంకరింపుడు.

వీరులు:-(సాలోచనులై నిలువబడియే యుందురు.)

ప్రభా:-సోదరులారా! దయచేయుడు.

వీరులు:-(ఉపవిష్టు లగుదురు.)

బల్ల:-మీ సంగమ మైనపుణి శ్లాఘనీయము. ఇట్టి యుత్తమవీరులు గల రాజన్యుడు ధన్యతముడు.

1 వీ:-(కోపముతో) అట్టి వీరసమృద్ధి నందినవాడనను నహంభావమును కటకేశ్వరుడు మాకట్టెదుట బ్రదర్శించి మ మ్మవమానింప నక్కఱ లేదు.

ప్రభా:-(శాంతముగ) సోదరా! మనప్రభువు లిపుడు సెలవొసంగినవి మీ యభినందనములే కాని...

2 శూ:-(తీవ్రముగ) మన ప్రభువా? మన ప్రభువా? వీరి కీతడు ప్రభువు? మా కీతడు ప్రభువు కాడు, కానేరడు, ఎన్నిజన్మముల కైనను సోమదేవచక్రవర్తి మాత్రమే.

భీష:-(వికటాట్టహాసముతో) ఆంధ్రదేశ మాక్రమించుకొనిన యవనీపాలుడు- అందలిప్రజలగు మీకుమాత్ర మేల ప్రభువు కాకుండునో- ఇది వింతమాట.

1 శూ:-వీరత్వము లేకున్నను కేవల సైన్యాధిక్యముచే మీరు మాదేశ మాక్రమించుకొనినంతనే మా యాంధ్రుల యంతరంగములపై నధికార మున్నదని తలంచుట యవివేకము.

బల్ల:-(శాంతముగ) మిత్రములారా! మీపై నధికారము జూపుటకు గాని, యవమానించుటకుగాని మి మ్మిట కాహ్వానించియుండలేదు. మీసాయము నర్థించి, మీయాశయముల ననుసరించియే యాంధ్ర పాలన మాచరింప నెంచితిమి.

2 శూ:-(వికటముగ నగుచు) ఆఁ ఆఁ పరిపాలనమే? ఆంధ్రభూమినే? అబ్బా! ఎంత దురాశ! పరిపాలన మనగ నంత పైపై నున్న దేమి? పరరాజహీనుడు పరమపావనమైన మా యాంధ్రభూమి బాలింప గల సమర్థుడా? ఆఁ.

ప్రభా:-(వారించి) సదయులై- సరసముగ- సశాంతముగ పలుకు సార్వభౌమున కివియేనా? సహృదయులగు నాంధ్రవీరసింహు లిడవలసిన యుత్తరములు? సోదరా! శాంతించి హృదయావేగము నించుక సడలించుకొని మాటాడుట న్యాయము గాదా?

1 శూ:-కటకపురామాత్యా! ఎవరితో నెటులు ప్రసంగింపవలయునో- యెవరి కెంత గౌరవ మొసంగనగునో- మా యాంధ్రులే పరదేశీయులకు బోధము చెప్పగలరు. అర్హమగుదానికంటె నధిక గౌరవము మీ రాజున కొసంగితిమే యని లోలోన నిపుడు పశ్చాత్తాపము నందుచుంటిమి.

బల్ల:-(సక్రోధముగ) ఇక చాలింపుడు. మీ రటులు తాపమో పశ్చాత్తాపమో పడుచుండుడు. అనాలోచితముగ శునకముల సువర్ణాసనములపై నుంచినఫలిత మిది.

2 శూ:-అమితవిశ్వాసముగల యాంధ్రశునకములే నీవంటి నరరూపఖరములకంటె నుత్తమమైనవి. నీ కల్లపొగడ్తల కుబ్బి పాదాక్రాంతు లగునవి వేఱు లాంధ్రులలో నేరును లేరని యిపుడైన గ్రహించితివా? జయము, జయ మాంధ్రదేశమాతకు-

భీమ:-ఈ బుద్ధిహీనులు గర్భవతియగు తమ రాణిని జూచుకొని యూసించుచున్నారు గాబోలును. ఆమె మీకు దక్కెనగదా!

బల్ల:-(తీవ్రముగ) భీమణామాత్యా! మీరు స్వయముగ నేగి యంతఃపురమునుండి యా రాజపత్ని నిట కీడ్చుకొని రండు. వీరియెదుటనే గర్భమును జీల్చివైచెదను.

శూరులు:-శివశివా! అయ్యో! దారుణము! దారుణము.

ప్రభా:-మహారాజా!........(మిన్నకుండును.)

1 శూ:-ఎంతటి దుర్నయమునకు సిద్ధమైతివిరా! నీ పాపము పండెడుకాల మాసన్నము కాలేదటరా!

(నే పథ్యమున) జయము. జయము. బల్లహరాజేంద్రులకు.

బల్ల:-(విని) ఎవ్వరు వారు ?

ప్రభా:-మనగూఢచారి గాబోలును.

(గూఢచారి ప్రవేశించి నమస్కరించును.)

బల్ల:-ఏమి? వార్త లేమైన నున్నవా ?

గూఢ:-చిత్రము. మహాప్రభూ ! అంతఃపుర మంటింపబడినది. అగ్ని జ్వాల లాకసము నంటుచున్నవి. అందు జిక్కువడిన యాంధ్రరాజ్ఞీ మణి దుర్మరణమునకై యాంధ్రలోక మాక్రిందన మాచరించు చున్నది.

ప్రభా:-(ఇంచుక తీవ్రముగా) అంతిపురి నంటింప నెవ్వరాజ్ఞాపించినారు?

భీమ:-(గంభీరముగ) విజయోత్సాహము మితిమీరుటచే మనసైనికులే యీ కాంతపనిని గావించి యుండిరేమో! ఆనందసమయమున వారిని వారింప నెవ్వనితరము ?

బల్ల:-(తల పంకించి) కాగలకార్యమును గంధర్వులే తీర్చినారు.

1 శూ:-అయ్యో! అయ్యో! ఎట్టిమాటలు మా పాపపుజెవుల బడినవి. ఓ సిద్ధేశ్వరా! నిను బ్రతిష్ఠించిన మా రాజకుటుంబము నెడల మంచి వాత్సల్యమే చూపితివి.

2 శూ:-ఈ కిరాతుని దుర్ణయము నిం కెంతకాలము సాగనీయదలచితి వయ్యా! అయ్యో! అంతయు నంతరించినదా-

బల్ల:-(గంభీరముగ) కరుణించినకొలది కాఱు లఱచుచున్నవీరల నా మరణాంతమును కారాగారమున నుంచి కఠినముగ దండింపుడు.

భీమ:-ఎవ్వ రక్కడ ?

(ఇరువురుభటులు సాయుధులై ప్రవేశింతురు.)

బల్ల:-ఈ బంధితుల చెఱసాలలో నుంచుడు.

(భటులు వీరుల దోడ్కొని యేగుదురు.)

బల్ల:-ఇప్పటికి మా విజయపథము నిష్కంటక మైనది.

( తెర పడును. )

# ఆంధ్రదీక్ష

## చతుర్థాంకము — చతుర్థరంగము

ప్రదేశము:-అనుమకొండలోని యగ్రహారము.

ప్రవేశము:-గిరిక.. సిరియాలదేవి.

సిరి:-(నిట్టూర్పుతో) ఉస్స్. అనుమకొండపాలకుఁడుగూడ, యీ యభాగ్యదేవతను రక్షింపజాలనని నుడివినాఁడు. ఔను. ఆయన సదయుఁడే! ఐన నేమిలాభము?

తే. గీ. సకలజనులను గాపాడజాలువట్టి
ఘను డుపకరింపకుండు నొకానొకనికి
ధారణిన్ ప్రాణిజీవనాధార మైన
యన్న ముపకారియా? యజీర్ణామయునకు?

అయ్యో! మా యభాగ్యదశయే యిందులకు గారణముగాని వేరేమి?

గిరి:-(వెనుకకు ఁదిరిగి) అమ్మా! వచ్చుచుంటివా? (దీనముగ) ఇట్టి కఠిన భూముల నీ పదము లెన్నడైన మెట్టినవా? తల్లీ! ఈ కఠినాత్మురాలు నిన్ను నడచి రమ్మని వేగిరించుచున్నది.

సిరి:-ఊరకొనవే గిరికా! దుఃఖ మెల్ల దిగమ్రింగి యుంటినే- నాకిప్డాయాస మావంతైన లేదు. (చంద్రునిఁ జూచి) అటు చూడుము. ద్విజరాజులకు గృపారసము సహజ మనుటకీ ద్విజరాజే తార్కాణము సుమా! భగవానుఁ డగుసిద్ధేశ్వరుఁడు మన కనుగ్రహించిన విద్యుద్దీపిక సుమీ యాతఁడు.

గిరి-అక్కటా! ఎక్కడి కక్కడే (ఎంత కంతే) తృప్తి నందుచుంటివా తల్లీ! ఔను పొందక చేయున దేమి? బల్లహా! మా యమ్మ నెంతగ బాధించుచుంటివిరా! ——

సిరి:-మాటిమాటికి నీవే యీ గతి చింతిలుచున్నచో నాకు ధైర్యము గరపి యూరార్చువా రెవ్వరే గిరిజ! (విని) అటు వినుము. అగ్రహారమున నేదియో గోల వినబడుచున్నది. ఏమే వినుచుంటివా?

గిరి:-(శ్రవణించి) అమ్మా! తెలవాఱుజా మైనది. విద్యార్థు లపుడే మేల్కాంచి వేదపాఠముల జింతనము గావించుకొనుచున్నారు. త్వరపడుము తల్లీ!

సిరి:-ఈ యగ్రహారమున నీ వెఱింగినసమర్థు లేరైన నున్నారటే.

గిరి:-అమ్మా! సభాపతి వృద్ధమాధవశర్మగా రున్నారు. ఆయనపై నగ్రహారవాసులకెల్ల నమితభక్తివిశ్వాసములు గలవు. అదె కాన్పించు చిన్న మేడయే వారి నివాసము- రమ్ము-

(ఇరువురు నిష్క్రమింతురు.)



# ఆంధ్రదీక్ష

## చతుర్థాంకము - పంచమ రంగము.

ప్రదేశము:-వృద్ధమాధవశర్మ గృహము.

ప్రవేశము:-మాధవశర్మ- బల్లహుని మంత్రిలు- ద్విజులు బ్రాహ్మణీ వేషధారిణి సిరియాలదేవి.

మాధ:-ఎంతదారుణ మెంతదారుణము! బ్రాహ్మణవనితల ప్రభువులు చెఱబట్టుపాపపుకాలము దాపురించినదా? దైవమా! కంచియే చేను మేసిన నింకేదిదిక్కు? పోషకులే యిటు లోనరించుట న్యాయమా? ఎంతటిగతి పట్టినది. పూర్వజన్మమున నెవ్వని నేడ్పించితినో. (సిరియాళదేవిని గౌగిలించుకొని) అమ్మా! అమ్మా! ఏమే, తల్లీ! అభాగ్యులమగు మా కడుపున బుట్టక నీ వొకపంచముని

యింట బుట్టిన నీకీయాపద రాదుగదా! సిరియాళదేవి గర్భవతి యట. ఈ దిక్కుమాలినగర్భము నీకుగూడ నీ సమయముననే గలుగవలయునా? శివశివా!

పరిభా:-ఆర్యా! మాధవద్విజోత్తమా! మీ యగ్రహారనివాసులే- మీ గృహసమీపమున నున్నవారే- పతంజలిశాస్త్రిగారే మా మహారాజున కీవిషయ మెఱింగించుటచే మేమిటకు వచ్చితిమి. తగినయనుమానము లేనిచో మీ కిట్టిశ్రమ నొసంగుదుమా?

మాధ:-అయ్యో! అయ్యో! పతంజలిశాస్త్రియేనా? మాకొంప దీసిన వాడు? బ్రాహ్మణాకృతి గల యీ పశువుమాట నమ్మి నాగొంతుక మెలివెట్టెదరా? పరిశ్నింపుడు- ఇయ్యగ్రహారము నెల్ల పరిశ్నింపుడు. దయామయులారా! నా కాతడు పరమవిరోధి యగునో- కాడో కనుంగొనుడు. ఎంత పాడుపని జేసితివిరా? నీచుడా! మన యుభయులకును విరోధముగాని, మా యమాయికపుపిల్ల నీ కేమి యుపకార మొనరించినదిరా? సిందుచూలాలే నీ పాపపుగన్నులకు గాన్పించినదా! దేవు డున్నాడు సుమీ! ఇంతకింతయు నీ వనుభ వింపకపోవు.

భీమ:-(గట్టిగ) అయ్యా! మీ సమాధాన మంతగ సహేతుకముగ లేదు. మేము నమ్మజాలము. ఈ మెం గొంపోవుట మానము.

ప్రభా:-(అపవారించి) అంతకర్కశముగ మాటలాడెద వేమి మిత్రమా! ఇంకను గొంతతడవు సశాంతముగ విచారించుదము.

1 బ్రా:-(కోపముతో) ఔను. పైత్యరోగినాలుకకు పంచదార చేదుగ నుండదా? జ్వరితునకు పథ్యవస్తువనిన నోకిలింత గాదా? మీకు సత్యవచనము శ్రుతికటువుగనే యుండును.

పరిభా:-బ్రాహ్మణోత్తమా! శాంతింపుడు. శాంతింపుడు.

సూధ:-(సూతుం గౌగిలించుకొని) నా కన్నతల్లీ! నీ కెంతగతి పట్టినదే! తీర్థయాత్రల కేగిన నీ భర్తకు తిరిగి వచ్చినపిదప చిన్నబిడ్డను గనుపఱచునదృష్టము లేదా? ఆతడు వచ్చి నిన్నడిగిన నేమి చెప్పెదునే? తల్లీ! అయ్యో! అయ్యో! ఓ సిరియాలదేవీ! నా ముద్దుబిడ్డను జంపించుటకేనా నీ వవతరించితివి. ఓ యార్తరక్షణాపరాయణా! ఓ ద్రౌపదీమానరక్షకా! కృష్ణా! కృష్ణా! దయ లేదా? బల్లహప్రభువు మనసున నించుక కరుణాంకురము మొలకెత్తింప లేవా?

భీమ:-ఇంక చాలింపుడు. మీ కపటాభినయముల విశ్వసించి మఱలిపోవునంతటి బుద్ధిహీనులము గాము. మాకును భగవంతు డించుక తెలివి ననుగ్రహించియే యున్నాడు. మే మిట్టినాటకము లెన్నో చూచియుంటిమి.

ప్రభా:-(అపవారించి) అబ్బా! అనుపయోగము లగువాదోపవాదము లెందులకు? మనము వచ్చినపని మానుదుమా? కాని- అటు చూడుము. ఎంతగ విలపించుచున్నదో- ఈమె రాణి కాదేమో.

భీమ:-నీవు వీరి యింద్రజాలములో బడిపోవుచున్నవాడవు. నాటకమునందలి దుఃఖము సత్యమేనా?

1 బ్రా:-శివశివా! కలియుగమున తొలిపాదముననే యిట్టి దుర్ణయముల కారంభమా? బ్రాహ్మణమానవతులకే మానభంగము దలపెట్టితిరా? మీరు మానవులేనా? పాపభీతి లేదా? భావిగతి విచారింపరా?

ప్రభా:-(కరముల మోడ్చి) మహాత్ములారా! క్షమింపరా? మమ్ము నిందింప న్యాయమా? రాజాజ్ఞ- మే మేమి చేయుదుము.

2 బ్రా:-ఔను. నాయనా! ఔను. రాజాజ్ఞ; మీ రేమి చేయగలరు? కొనిపొండు. శీఘ్రగతి కొనిపొండు. మీ మహారాజునకు మహా

పుణ్యము, సత్కీర్తి కల్గునటు గొనిపొండు. మా గొంతుకల గోసి బ్రహ్మకల్పముగా మీరే జీవింపుడు. వింటిరా ! మరువక నా యీ పలుకుల మీ ప్రభువునకు నివేదింపుడు.

3 బ్రా:-(కరమెత్తి) ఎంతదారుణమును దలపెట్టితి వయ్యా! ఆంధ్రిదేశ మాక్రమించుటతో మీ యాశ లంతరింపలేదా ? మా ప్రాణముల గూడ కబళించినగాని మీ యాకలి తీరకున్నదా ? తీయుడు-ప్రశాంతవర్తనుల ప్రాణముల దీయుడు. పోగాలము దాపురించినపు డేమిచేయుదురు ?

4 బ్రా:-( తీవ్రముగ ) బ్రాహ్మణజాతి యనిన నంత చులుకనయా ? పూర్వ మిరువదియొక్కమారు క్షత్రియుల నాశ మొనర్చి వారి రక్తముచే బితృతర్పణ మొనర్చినద్విజకేసరి పరశురాము డెవ్వడో గుర్తించితిరా ? ముందు వెనుకల వితర్కించుకొనుడు. ప్రశాంత మానసులగు బలహీనులగు బ్రాహ్మణు లేమిచేయగలరని భావింపకుడు. అతిశీతలమైన యంబుధరములో నన్యోక ర్షణవలన నశనిజనించుట లేదా? పర్వతముల బ్రద్దలుకొట్టుట యసత్యమా ?

5 బ్రా:-( తీవ్రముగ ) ఇన్నిమాట లెందులకు ? మీ రీ ద్విజసాధ్విని బలాత్కరించి గొంపోదు రేని మా యగ్రహార వాసుల మెల్లరమును ఇపుడే- మీరు గనుచుండగనే- మీ సమక్షముననే- యొక్కసారిగ నగ్నిలో నురుకుదుము.

అందఱును:-(ఏకగ్రీవముగ) అదియే మా యందఱి నిశ్చితము, తప్పదు. పుత్రమిత్రకళత్రాదులతో నాబాలగోపాలమును సంసిద్ధులము.

ప్రభా:-( చేతుల జోడించి శిరముపై మోపి ) పూజ్యులారా! దయయుంచి యెల్లఱును శాంతింపుడు ?

భీమ:-(సక్రోధముగ) శాంతింప నక్కఱలేదు. మెల్లగ మాటాడుకొలది ప్రల్లదము లతిశయించుచున్నవి. మీ రెల్ల దచ్చినచో మా మహారాజున కావంతయు. . .

ప్రభా:–( ఆపి ప్రక్కకు గొనిపోయి ) అయ్యయ్యో! ఊరకొన వేమి ప్రారబ్ధము– మనకఠోర శాసనములకు బుద్ధిశాలురగు నీ ద్విజులు మాత్ర మావంతైన జలింపరు. వీరికి ప్రాణమనిన తృణప్రాయము. వీరలు చెప్పినదెల్ల చేయగలరు. ఆగుము. ఒకయుక్తి బన్నెదను. చూడుము.

భీష:–ఊఁ కానిమ్ము. ఇంత మెత్తదనమువలన లాభము లేదు.

ప్రభా:(ద్విజుల నుద్దేశించి) అయ్యలారా! నా మనవి నొకదానిని చిత్తగింపుడు. ఈమె మీ వివాహితగన యని మీరనుచున్నారు. అట్లైన మీరీమె వడ్డించునన్నమును భుజించెదరా? అటు లాచరించినచో మే మీమెను విడచిపుచ్చుట చెల్లును,

మాధ:–అయ్యా! ఇందుల కెంతమాత్రమును నభ్యంతరము లేదు. నా పుత్రిక వడ్డింప నా కేమియభ్యంతరము? మా జాతివారగు వీరల కేమిసంశయము? కాని ప్రస్తుత మొకయాటంక మున్నది.

భీష:–అదిగో! ఏదియో మాయ పన్నుచున్నారు.

ప్రభా:–(అపవారించి) ఆగుము సోదరా! (మాధవశర్మతో) మాధవార్యా! ఆ యాటంక మెద్ది?

మాధ:–మీరు ధర్మపాలకులు, న్యాయశాస్త్రవిధుల విచారింపవలసిన భారము మీయది, ఈమె నిండుచూలింతరాలు గదా! పరమ నైష్ఠికులమగు మా కీమె తాకినయన్నము భుజింప వలనుపడునా? ప్రసవానంతరమున...

భీష:–ఏ మేమి? కటకమున కేగుటమాని ప్రసవించువరకును మ మ్మిచటనే యుండుమందురా? అది లాభములేదు?

1 విప్రి:–అట్లైన పురాతనాచారములు బుగ్గిచేసుకొనుమందురా?

ప్రభా:–మిత్రమా! భీషణా! ఈ విషయము విచారణీయమే కావున నీవు మనప్రభువున కీవిషయము విన్నవించి...

భీమ:-అబ్బా! అనవసర కాలక్షేపము.

పరిభా:-అటు లాతురత వలదు. పోయి రమ్ము.

భీమ:-(నిష్క్రమించును.)

పరిభా:-(తనలో) ఈమె మాధవశర్మగారి కొమరితయేనా! కాదు-కాదు- ఈపదారువన్నె బంగరుచాయమేను- ఈవిశాలనేత్రములు-నిలిచిన నేల దాటుపెన్నెరులు- ఈ ముఖమున ధీరత- నడలలో రాజసము- ఇవన్నియు రాజలక్షణములే- (ఆలోచించి) ఓను బ్రాహ్మణజాతీయులలో మాత్రి యిట్టిసౌందర్యవతులు లేరా? ధీరత, రాజసమును ననుమానదూషితమగు నా మనసునకు దోచుచున్న వేమో! సత్యముగ లేవేమో! వేదపారంగతులు- ధర్మనిర్ణేతలు నగు నీ యవనీసురు లీవిషయమున ననృతము వల్కుదురా? రాజ్యభ్రష్టయగు నీమెవలన వీరి కేమిలాభము? (ఆలోచించి) మానినీమానప్రాణరక్షణార్థము పలికిన యనృతము సూనృతమే యనుధర్మసూక్ష్మము నవలంబించిరేమో కదా! నిరవకాశముగ నిందఱ కేక కాలమున నిట్టిబుద్ధి జనించియున్నదా? అసంభవము-ఇ అటులనుటకును వీలులేదు. మాధవశర్మగారు సభాపతి యనియు, నగ్రహారమునందల్లలును వారికి విధేయులనియు, పతంజలి శాస్త్రిగారు మున్నే నుడివియున్నారు- (ఆలోచించి) ఈమె సిరియాలదేవియే యగుగాక. ఈమె యేమ్మెము చేసినది? ప్రాణభీతిచే బ్రాహ్మణుల నాశ్రయించిన యబలామణి. ఈమెను బాధించిన భగవానుడు మమ్ము క్షమింపడు.

మాధ:-దయామయా! మమ్ము గరుణింపవా?

పరిభా:-(తనలో) ఈమెను రక్షించుటయే కర్తవ్యము- ఈమెవలన మాన రేందుకైన కేమిప్రమాదము. భీమణవర్మ వీరిపై గొండెముల జెప్పి రాజున కాగ్రహము గల్పింపగలడు. నే నేగి దాని వారింప

వగును. (ప్రకాశముగ) మహాత్ములారా! భగవానుడే యిందలి సత్యాసత్యముల నిర్ధరింప సమర్థుడు- నేను వెడలుచుంటిని. యీమహీధవునివార్త వచ్చువఱకును మీగృహమును మాభటులు గాచుచు నుందురు. అటుపై మీ యదృష్టము- నే నేగ ననుజ్ఞ నిండు.

(నిష్క్రమించును.)



# ఆంధ్రదీక్ష

## చతుర్థాంకము-షష్ఠమ రంగము

ప్రదేశము:-సిద్ధేశ్వరాలయము.

ప్రవేశము:-బల్లహప్రభువు, ప్రభాకరభీషణవర్మలు- సిరియాలదేవి- ద్విజసంఘము.)

బల్ల:-(చేతులు జోడించి) విప్రపుంగవులారా! ఈమె సిరియాలదేవి యను భ్రాంతి మా కుదయించుటచే మీ యందఱ కింత శ్రమ నొసంగవలసివచ్చినది. నేనును భారతీయుడనే- మీ సదాచారములకు భంగము గల్గింతునా ? మా సంశయము శమించుకొఱకు మీ రలీమె వడ్డించు నువ్వును, నేతిని భుజింప నంగీకరింప గోరుచుంటిమి.

ప్రభా:-ఎల్లరును దయయుంచి పంక్తుల దీర్చి కూర్చుండుడు.

(బ్రాహ్మణులు కూర్చుందురు- ఒక డాకుల వేయును.)

మాధ:-అమ్మాయీ! భయము లేదు. రా తల్లీ! రా. వచ్చి మహారాజసమక్షమున వడ్డింపుము.

సిరి:-(సందేహించును.)

మాధ:-సందియ మెందులకమ్మా! మహారాజు మనకు తండ్రివంటి వాఁడు.

బల్ల:-అమ్మా! నీకు నేను సోదరసమానుడను. సంశయింపకుము.

సిరి:-(వర్ధించును) (ఎల్లరును భుజింతురు.)

బల్ల:-(సవినయముగ) అమ్మా! నీవు మా శత్రురాజపత్నివని భ్రమించి నీ కించుకశ్రమ నొసంగక తప్పినదికాదు. క్షమింపుము తల్లీ!

సిరి:-(తలవంచుకొని కించిత్కోపముతో) రాజమహిషి నని యింత బాధించి అచ్చ కీడిచి ప్రాణముల దీయసంకల్పించిన మీరలు క్షమింపుమని యనుటకు...

మాధ:-(చేరి) అమ్మా! ఊరకొనవే- ఏమి చేయుగలము? మన పూర్వ జన్మపాపఫలిత మిది. మీ యమ్మకడు పింతవఱకు చలువమైనదే.

బల్ల:-తల్లీ! తల్లీ! అచ్చ కీడ్చితినా? ధర్మాధర్మము లెఱుంగనివాడనా? అపనిందపాలు గాకుండుటకే పవిత్రదేవాలయమీమకు రావించితిని. శాంతింపుము. నన్ను క్షమింపుము.

మాధ:-అమ్మాయీ! శ్రీ ప్రభువువారి సెలవు గైకొని యింటి కేగి మీ యమ్మను చావకుండ గాపాడుకొనవే-

బల్ల:-నా యనుజ్ఞ యేల మహాత్మా! మీరే మా కనుమతి నొసంగ వలయును. గత మెల్ల మఱవగోరెదను క్షంతవ్యుడను.

ప్రభా:-ఆర్యమాధవుల కభివందనములు. అనుజ్ఞ యా?

మాధ:-(ఆనందముగ) అయ్యా! మీలో సత్యదేవత సాక్షాత్కరించి మమ్ముద్ధరించినది. చిరాయుష్మంతులై యితోధికసత్కీర్తి నందుడు.

(బల్లహపత్రిభాకరులు నిష్క్రమింతురు.)

బ్రాహ్మ:-(సోత్సాహులై) జయ! జయ! శంభో! శంకర! సిద్ధేశ్వర స్వామిన్!

మాధ:-(దేవతాభిముఖుఁడై)

మ. బలమా లేదు శరీరమందున- చమూపాత్రిబల్యమా లేదు- ధీ
బలమా మిక్కిలి సన్నగిల్లెను మహాభాగ్యంబులా లేవు- మా
తలమా? యీ ఘనకష్టవారినిధి నీదన్ నీ కృపాదృష్టినా
కలచే కాని శ్రితావనైకబిరుదాంకా! దేవ! సిద్ధేశ్వరా!

అందఱు:-జయ! జయ! భగవన్! సిద్ధేశ్వరస్వామిన్!

(యవనిక జారును.)



# ఆంధ్రదీక్ష

## చతుర్థాంకము-సప్తమ రంగము

ప్రదేశము:-వృద్ధమాధవశర్మగారి సౌధాంతర్భాగము.

ప్రవేశము:-మాధవశర్మ- గిరిక.

వృ. మా:-గిరికా! చూచితివా! చిరంజీవిని బాగుగ జూచితివా! ఈ బాలకుడే నీ పరిశ్రమఫలితము- ఆంధ్రదేశమునకు నీ వొసగిన భిక్షు.

గిరి:-మహాత్మా! ఈమీ సేవకురాలి నింతగొప్పగ ననుట న్యాయమా? ఎఱుక దేవమహారాజగారివలెనే మీరుకూడ నాటి ప్రమాదసమయమున నిలువ నీడ నొసంగనిచో మా యమ్మగతి యేమియగును? ఆదినుండియు మా దేవికి బ్రాహ్మణులపైననే భక్తివిశ్వాసములు. అవియే నేడామె నుద్ధరించినవి.

వృ. మా:-అది యేమిమాట! నీ వానా డంతఃపురము దహించి రహస్యమార్గమున నిటకు దోడ్కొనిరానిచో నేను మాత్ర మేమిచేయగల్లుదును? బల్లహబహుమతి కాసించి పతంజలిశాస్త్రి యెంతటి

కానిపని చేసెనో వింటివిగాదా! ఏమైన నేమి? అప్పటి కాగండము తప్పినది. నీవు సిద్ధసంకల్పురాలవు. నాకును మాటదక్కినది.

గిరి:-(ఆనందముగ) బాలుడు సరిగ మా సోమదేవభూపాలుర పోలికయే సుడీ! ఆ సొగసైనులలో రక్తరేఖలు- ఆ నాసికవాటము- ఆ పెద్ద చెవులు- విశాలమగునా నుదురు- అచ్చముగ తండ్రిగారి నోటి నుండి వచ్చినటు లున్నాడు సుడీ. ఇటుపై పతంజలిశాస్త్రిగారి పాపదృష్టి పాపనిపై బడకుండ నున్నచో మనయందఱి యదృష్ట రేఖలు బైటపడినవని యానందింపవచ్చును.

వృ. మా:-పతంజలిశాస్త్రి యి కేమియు జేయజాలడు. కోరలు దీయ బడిన కోడెత్రాచువలె నున్నాడు. బల్లహోద్యోగు లేరును నాతని మాట లిపుడు చెవిని బెట్టరు. పైగ బరిహసింతురు. అగ్రహార వాసు లెల్లరును నాతని నాంక్ష జేసినారని నీ వెఱుగవా?

గిరి:-అయ్యా! అటులైన బాలునకు పాపగ్రహబాధ తొలగినటులే. మీ వంటి మహామాంత్రికు లుండ నేమిప్రమాదము. మా బాల రాజునకు నామకరణమహోత్సవ మెపుడు?

వృ. మా:-(నగుచు) అయినది. ఆ యవశిష్టమును దీరినది. పెద్ద వాదోపవాదములైనపిదప పట్టుబట్టి- మా మాటల జనవుచే నుల్లంఘించి తల్లిగారే నామకరణ మొనరించినారు.

గిరి:-ఏమని యా వాదోపవాదములు మహాత్మా! పితామహు లగు విజయపాలుర నామధేయ మిడుటకు?

వృ. మా:-కాదు. ఆ పేరు పెట్టలేదు. మన సిరియాలదేవికి ప్రస్తుత కాలజనకుడను నేనే కాదా. అందుచే నాపె పట్టుబట్టి బాలునకు మాతామహునిపేరుంచినది. చిన మాధవశర్మ యని పిలుచుకొను చున్నది.

గిరి:-(సంతోషములో) ఆహా! బ్రహ్మానందము- మా యమ్మ తనకృత జ్ఞత చక్కగ వెల్లడించినది. కాని మహానుభావా! ఎంత చేసినను- ఎన్ని జన్మము లెత్తినను మా యమ్మ మీ ఋణమును దీర్చుకొనగలదా?

వృ. మా:-గిరికా! ఆకసమును నమ్మి మనమిపుడు విత్తుల జల్లితిమి. ఎన్నటికో జరుగనున్న యాంధ్రరాజ్యపునస్థాపనముకొఱకై యెదురు చూచుచుంటిమి. ఏమి కాకున్నదో? సిద్ధేశ్వరు ననుగ్రహము పై నాధారపడియున్నది.

గిరి:-స్వామీ! నాకిక బో నాతని నిండు. లోని కేగి సుతియొకపరి మా చిన్నయాంధ్రసార్వభౌము ముద్దాడి యనుమకొండ కేగెదను.

(నిష్క్రమించును.)



# ఆంధ్రదీక్ష

## చతుర్థాంకము-అష్టమ రంగము.

ప్రదేశము:-కందారపురమున కళాశాలాప్రాకారాంతరస్థలి.

ప్రవేశము:-చిన మాధవశర్మ- విద్యార్థులు.

చి. మా:-వినుచుంటిరా? నా యాంధ్రదేశీయసోదరులారా! మీరు మేకపిల్లలు గాదు, సింగపుగొదమలు. గులకఱాలు గాదు, జీవరత్నములు. గోదావరీకృష్ణాది పవిత్రనదీజలముల మీరు గ్రోలుచున్నంతకాలమును- నాంధ్రదేశీయవాయువులు మీ నాసికాపుటముల నట్టాడుచున్నంతకాలమును- మీ దేహమున వీరరసము పుట్టుచునే యుండును- పెఱుగుచునే యుండును- ఉప్పొంగుచునే యుండును. మన మెల్లరమును తగినకాలమునకై వేచియుండవల

యునే కాని, యభాగ్యుల మని, యస్వతంత్రుల మని, యథమాధముల మని, బానిసల మనియు, బరితపింప వలదు, కాము. మన మెన్నటికిని బానిసలము గాము. నిరంకుశులమే. పరమస్వతంత్రులమే. భాగ్యములు పోయిన పోనిండు, పరదేశాధీశుడే ప్రస్తుత పరిపాలకుడు కానిండు. కట్టుకొనుచున్నవి కటకపురవర్తకు లమ్ముచున్న వస్త్రములే కానిండు. మాటాడుకొనుటకైన మన దేశభాషలో- మన యాంధ్రభాషలో మన మనోభావముల వెలువరించుకొనుటకైనను స్వాతంత్ర్యము లేకపోవుచున్నదే. పరదేశీయ భాషలో వ్రాయబడినవియే మనకు బఠనీయగ్రంథములుగా నుండ వలయునను దారుణశాసనమునకు మనము "దాసోఽహ" మ్మన వలసినదేనా?

శ్రోతలు:-జయము- జయము- ఆంధ్రభాషకు.

చి. మా:-నా సోదరులారా! ఈ తాత్కాలికావేశములవలన-లాభము లేదు. మీ యుత్సాహశక్తుల జూపవలసినది మాటలలో కాదు క్రియలలో, మీ యావేశముల దెలుపవలసినది యాలాపములలో కాదు. ఆచరణములలో- మీ ప్రతిరక్తబిందువును పరిశోధించుకొనుడు. దానిలో పిఱికితన మావంతైన నున్నచో వెంటనే యా భాగమును ఛేదించుకొని రక్తస్రావము గావించుకొనుడు.

సభలో:-(వినుడు- వినుడు- వినుడను కేకలు)

చి. మా:-ఒక్క విషయ మాలోచింపరాదా? మన తెలుగునేల యెంత యధమాధమస్థితికి బోవుచున్నదో యరసితిరా? బల్లహోద్యోగులెల్లరు గటకమునుండి యిటకు బంపబడినారు. ఇంకను తండోపతండములుగ బంపబడుచునే యున్నారు. దీని భావమేమి? మన యాంధ్రభూమి గొడ్డుపోయినదా? ఇచట విద్యాధికులు లేరా? వీరి నందఱ నిరాకరించి, నిరాదరించి యచటివారి నిటకేల రావింప

వలయును? కారణము తేట తెల్లమే కదా! ఇం కెందులకు? మనల జీవచ్ఛవంబుల గావించుటకే కాదా? మన యాంధ్రజాతి నణగ ద్రొక్కుటకే? ఆంధ్రభాషను సమూలముగ సంహరించుటకే కాదా? దీని నోథ్రియయము గావించుటకే కద!

సభాస్తారులు:—అయ్యో! సత్యమే— నిక్కువమే.

చి. మా:—ఇచటికే తెంచి మనపై నధికారముజూపు నోథ్రుల వలన మన మొకవిషయము గ్రహింపనగును. వారిటకు వచ్చిరే— మనతో గలిసిమెసిలి తిరుగుచుండిరే— మన దేశీయధనముతో జీవించు చుండిరే. మన యుద్యోగముల గబళించినారే— వారి కార్యాలయములలో గాని— నివాసములలోగాని యాబాలగోపాలమును స్త్రీలు గాని, పురుషులు గాని తెనుగున మాటాడుకొనుచుండిరా? ఏల భాషింతురు? స్వభాషాగౌరవము వారెఱుంగుదురు. మన భాషా గౌరవమును మన మెఱింగిన పాఠశాలలో— పడుకటింట్లలో గూడ పరదేశభాషలో ప్రసంగించుకొనుచు, ప్రవీణులమని— బ్రహ్మాండ నాయకులమని యిటు విఱ్ఱవీగగలమా? ఏదేశమున భాషనశించునో యాదేశజాతి నశింపక తప్పదు— తప్పదు— మనవారలు సజీవ జాతిగా నుండగోరిన మనభాషను సంరక్షించుకొనుడు. పరకీయ గ్రంథము లెల్ల పారిభాషికములు గాకుండ పట్టుబట్టుడు. బల్లహ స్తపాలునకు ప త్రికాముఖముగ దెలియజేయుడు. దాని నాతఁడ నాదరించినచో వెంటనే విద్యార్థు లెల్లరు కళాశాలలలోని కేగ కుండ కట్టుగట్టుడు. ఆంధ్రేతరవిద్య నావలికి సాగనంపుడు. మీరాంధ్రులుగానే జీవింపుడు.

(నేపథ్యమున అగుము! బాలకా! అగుము,

సభ్యులు:—అడుగో— కొట్టుడు— తన్నుడు— చంపుడు— భీషణవర్మగారి కుమారుడు. చినమాధవా! ఉపన్యాస మాపవలదు.

చి. మా:-సోదరులారా! ఆ వేశముల నుపసంహరించుకొనుడు. నాగ రాజుగారి నేమియును చేయవలదు. వారు దండ్యులు గారు- వారి యధీకారమువూత్రమే దండ్యము. ఇది సమయము గాదు. శాంతింపుడు.

అయ్యా! ఇదిగో ముగించుచుంటిని (వేదిక దిగును.)

1 సభ్యు:-చినమాధవా! మమ్మాటంకపరుపవలదు.

చి. మా:-వలదు. వలదు. సమయ మింకను సమీపగతము గాదు. ఈత డమాయికుడు-

(పెద్దగోలతో బాలురు నాగరాజుదెస కేగుదురు.)

(అంతర్నాటకము సమాప్తి.)

(తెర పడును)

ప్రతాపవర్మ:-(రంగస్థలి నధిరోహించి) మహాజనులారా! ఆంధ్రసోదరులారా ! కుమారమాధవనాటకము ముగిసినది. రసవత్తరముగ నీ నాటకము రచించిన యనుమకొండాగ్రహారవాసి సోమశేఖర శర్మగారి కాంధ్రదేశపక్షమున కృతజ్ఞతాపూర్వకవందనము లర్పించుచుంటిని. ఇక శ్రీమదాంధ్రదేశ నవీనసార్వభౌములగు కుమార మాధవులు కొలదిగ భావికర్తవ్యము జనుల కాదేశింతురు. శ్రవణింపుడు.

(వేదిక నవతరించును.)

మాధ:-(వేదిక నధిరోహింప సభలో గరతాళధ్వనులు.)

"నా ప్రియసోదరులారా !

తరతరంబులనుండి మా కుటుంబము మీ ప్రజలచే గౌరవింపబడుచు పాలకశ్రేణిగా నియోగింపబడినది. ప్రజాశయము ననుసరించియే మా పూర్వు లాంధ్రావని బరిపాలించియుండిరి. అనాయాసముగ, నవలీలగ, నాంధ్రరాజ్యమును మఱల మీ సోమదేవభూపాలుని

సుతుడనగు నాకు నేడు మీరు హస్తంగతము గావించితిరి. ఇక నాంధ్రరాజ్యపునస్థాపనకార్యమును సుస్థిరముగ నిష్కంటకము గావింపవలసినభారము మీపైననే యున్నది. బల్లహాప్రతినిధి భీషణవర్మ రహస్యముగ నీసరికి కటకము జేరియే యుండును. మన యాంధ్రావని యింకను నాపదలనుండి విముక్తి నంది యుండలేదు. రేపే మన యాంధ్రసైన్యము లాయత్తములై రానున్నమోఘ సేనల జయించి శత్రువుల బరిమార్పవలయును. కటకమార్గయాన మునకై మనసేన లన్నియు సన్నద్ధములై యున్నవి. నా యాంధ్ర ప్రజ యేకగ్రీవముగా జయవెట్టి పంపించినచో విజయలక్ష్మిని గైకొని మరలి రాగలను.

ప్రజలుః-జయము. ఆంధ్రమాతకు- జయము మాధవచక్రవర్తికి.

( తెరపడును. )



# ఆంధ్రదీక్ష

## పంచమాంకము - ప్రథమ రంగము.

ప్రదేశముః-కటకపుర బాహ్యసీమ- పటకుటీరాంతము.

ప్రవేశముః-(పురుష వేషమున భవానీకుమారి.)

భవాః-(కరవాలమును చూచుచు)

మ. శిరముస్ వంచి నమస్కరించి యిదె ని న్జేపట్టి యాభీలసం
  గరరంగస్థలి దూక సిద్ధపడితిన్; క్రౌర్యం బవార్యంబుగా
  నరిపీరాళిశిరోధికోష్ణరుధిరం బౌకంఠముస్ ద్రావి నీ
  రొయిగలోనన్ సుఖనిద్ర నందు మటుపై నోచంద్రహాసోత్తమా!

ఆహా! అఖండమగు నవీన తేజము నాతనువు నాక్రమించినది. శత్రు సంహారము- వైరిమారణ మనుశబ్దములే నా కర్ణయుగళి మాఱు మ్రోగుచున్నవి. "లెమ్ము లెమ్ము. త్వరపడుమని యొక యశరీర వాణి యాదేశించుచున్నటు లున్నది. జయ! ఆంధ్రసామ్రాజ్య లక్ష్మీ! జయ! సిద్ధేశ్వర! జయ! పద్మాక్షీ భగవతి!

(అనుచు నడువబోవ చతురిక యెదు రగును.)

చతు:-(ఆశ్చర్యముగ) భ- వా- న- మ్మా! ఏమి యీ వీరపురుష వేషము?

భవా:-అవును. ఇది స్త్రీవిషయిక మైనసంగ్రామము. సిరియాలదేవి నవమానించిన యా తుచ్ఛుని జీవములతో నుంచిన యాంధ్రభూమి కమితపరివాదము. అత డవనిపై నరనిముసమైన నున్న మానినీ మణుల మానప్రాణములు నిలువనేరవు. కాంతాసంబంధ మగు సమరములో కాంత నగు నేను పాల్గొనక మానను. నేనే కాదు ప్రతిక్షత్రియ కాంతయు పాల్గొనవలసినధర్మ మున్నది.

చతు:-అమ్మయ్యో! కాంతు నెడబాయజాలక కటకమున కేతెంచితి వనుకొంటినిగాని, అబల- యతిసుకుమారి యాహవమున కాయత్త మగునని యనుకొంటినా?

భవా:-ఖండనమునకు- భగవదారాధనకును స్త్రీపురుష భేద మెందు లకే. మనకాంతలకు మార్గదర్శిని సత్య యున్నది. సుభద్ర యున్నది.

చతు:-అమ్మా! నా మాట కాసంత వినవా? ఆంధ్రవీరపురుషలోకము చాలదా యరినగరమును నేల గల్పుటకు?

భవా:-(శ్రవణింపక) అటు చూచితివా? చతురికా! ఆంధ్రజాతీయ కేతనము లాకసమున నెగురుచు బల్లవాని ఖండనమునకు రండని యాహ్వానించుచున్నవి. జడములకే యంత శౌర్యమున్నపుడు చేతనములు చేతగానితనము జూపవచ్చునా?

చతు:-భవానమ్మా! నీ వొక్క-రితవు లేనిచో నాంధ్రుల కపజయము గలిగినచో నవుడీ వేగవచ్చును లెమ్ము.

భవా:-ఆఁ అటులా? ఆలుబిడ్డల విడనాడి- సర్వసౌఖ్యముల దృణీక రించి నా నాథునితో టకే కాదా యింద తీత్యాగము జూపుచుండిరి. పరార్థమే వారు ప్రతినపట్టి యాహవసంసిద్ధులై యుండ స్వార్థ మనకైన నే నేల వీరి ననుకరింపరాదు.

చతు:-అటులైన మానవా? ఇందుల కయ్యగా రనుమతించిరా?

భవా:-నా కేరియనుమతియు వలదు ఇది నా విధి. నీవు వృథాబాధ నందకుము. నీ వొకపనిసిమాత్ర మాచరింపుము. ఇటు నా చెంతకు రమ్ము. చతురికా! నా వీర వేషము సరిగ నున్నదా?

చతు:-ఆఁ బాగుగనే యున్నది.

భవా:-న న్నెవరును గుర్తింపలేరుగదా.

చతు:-గుర్తింప కేమి? బారకు మీరినవాలుజడ నేలను జీరాడుచుండ, తాటంకముల తళతళలు కనుల గుట్టుచుండ, కాంతవే యని గ్రహింపలేని ఋష్యశృంగులా? జనులు.

భవా:-ఈ కమ్మలు దీసివేయ ననుకొంటివా? ఈ వాల్జడ చుట్టి పైన పాగా ధరింపకయే రణమునకు జనెద ననుకొంటివ టే. ఇవి గాక మిగిలిన వేస మెటు లున్నదే?

చతు:-ఏమో నమ్మా! ఇన్నిసంగతు లెఱిగినదానవు నిన్నింతిగ నాన వాలు పట్టలేకపోదునా? అదియుగాక సహజమైన యవయవసౌభా గ్యమును మగువలము మాటు చేయగలమటమ్మా!

భవా:-( నవ్వి ) చీ. యూరకొనుము. నీ పరిహాసముల కిది యదను గాదు. ఇపుడు వీరరస ముప్పొంగించు పరిసంగములే నా చెవుల బడవలయును.

చతు:-నీ యమాయికతయే కాని యీ నీ మగ వేస మెంత కాలము నిలుచు నమ్మా! నీవు యుద్ధ మొనర్తు వనుమాట.

భవా:-అడ్డుమాట లమంగళకరము లని నీకు తెలియదా? ఇక నట్లు మాటాడకుండుట మా ప్రాణసఖ ధర్మము.

చతు:-ఇది సత్యమే నటమ్మా! బల్లహరాజును చంపిన నెత్తురు చేతులతో వచ్చి సిరియాలదేవిగారి పాదములకు నమస్కరింతు మని యాంధ్రప్రభు లీదినమున వీరులసభలో ప్రతినపట్టిరని గిరిక చెప్పగా వింటిని.

భవా:-అవును. అప్పుడుగాని యాంధ్రరాజ్ఞీమణి పరిభవాగ్ని చల్లారునా! చతురికా! నీ వాశమారీ నిలువుటద్దమువరకు రావే. నేను తలపాగ జుట్టుకొందును. నీవు దీపముల సవరింపవలయును- ఈ లోన నేనే నాజ్ఞాపించిన మనసేవకు డశ్వము నాయత్త మొనరింపగలడు.

చతు-నడువు మమ్మా! నడువుము.

(ఇరువురు నిష్క్రమింతురు.)

# ఆంధ్రదీక్ష

పంచమాంకము-ద్వితీయ రంగము.

ప్రదేశము:-మాధవవర్మ గుడారము.

ప్రవేశము:-మాధవవర్మ- ప్రతాపవర్మ- ఆంధ్రకేసరి యను వీరుడు (శయ్యపై)

ప్రతా:-ఇందఱము మే ముండగ నాంధ్రసార్వభౌములే యాంధ్రకేసరి వర్మ కుపచారము స్వయముగ సల్పవలయునా?

మాధ:-నేనే యాచరింపవలసినవాడను ప్రతాపమహాశయా! ఏమందువా? అరివీరుని యాయుధమునకు గురి కానున్న తరి నడ్డుకొని నన్ని మహావీరుడే కాపాడినాడు. నే నీతని కుపచరింపవలదా? (విసరుచున్నాడు).

ధర్మలుప్తా.

శ్లో. ధర్మలోపవతీ తాసు
 శ్రౌత్యార్థీతి ద్విధా భవేత్
 సమాసాదితిరిగాత్యార్థీ
 శ్రౌతీ వాక్యసమాసగా.

ధర్మలుప్తా మాహ ధర్మలోపవ తీతి. తాసు లుప్తాసు ధర్మలోపవతీ లుప్తధర్మా శ్రౌతీ ఆర్థీతి ద్విధా భవేత్. తయోరిత్యధ్యాహారః. ఆర్థీ తు సమాసాదితిరిగా సమాసవాక్య తద్ధితగతా శ్రౌతీ వాక్యగా సమాస గేతి పంచ ధైవ. న తు ఆర్థీవ శ్రౌత్యా అపి తద్ధితగతత్వం సంభవతి ఇవార్థవిహితవతే ధర్మానుక్తావసంభవాత్ ఈషదసమాప్తౌ విహితానాం కల్పబాదీనాం విభాషాసుపఇతి విహితస్య బహుచ్ప్రత్యయస్య చ ప్రయోగే తు ధర్మివ్యవధానేన సాదృశ్యప్రతిపాదనా త్తత్రార్థ్యే వేతి పంచపరికారా ధర్మలుప్తేతి బోధ్యమ్.

ద్వివిధాపి శ్రౌతీ ధర్మలుప్తా యథా.

శ్లో. శ్రీసూర్యరాయక్షితిపాలమౌళే
 ర్యుఖం లతాంగ్యాః పునరంబుజాక్ష్యాః
 పునఃపున శ్చంద్రమి వావలోక్య
 య థేందుకాంతప్రతిమా స్తథైవ.

అత్ర ఇందుకాంతప్రతిమా యథేతి వాక్యగతా చంద్రమివేతి నిత్యసమాసా త్సమాసగతా ఉభయతాపి సాధారణధర్మా నుపాదానా ద్ధర్మలుప్తా సాక్షా త్సాదృశ్యవాచకప్రయోగా చ్ఛ్రౌతీ.

ఉదాహరతి శ్రీసూర్యరాయక్షితిపాలమౌళే రితి. లతే వాంగం యాసాం తాః అంగాదిభ్య శ్చేతి ఙీప్. లక్ష్యే లక్షణం యో జయతి అతేరితి యథా శబ్దప్రయోగా ద్వాక్యగతా చంద్రమివేతీవేనసహ నిత్యసమాసా త్సమాసగతా ఉభయతాపి ఆహ్లాదకత్వాదిధర్మానుక్తే రియం ధర్మలోపవతీ.

త్రివిధా ప్యార్థీ ధర్మలుప్తా యథా.

శ్లో. మందారకల్పం సుధయా
సదృశైవ గిరా బుధాః
సూర్యరాయవిభుం స్తుత్వా
జయంతి ధనదోపమాః.

అత్ర మందారకల్ప మిత్యత్ర తద్ధితగతాసుధయా సదృశేతి వాక్యగతా ధనదోపమా ఇతి సమాసగతా.

త్రివిధా మపి లుప్తధర్మామార్థీ ముదాహరతి మందారకల్ప మితి. బుధాః కవయః మందారకల్పం కల్పతరుసదృశం సదృశా సమయా "సదృశౌ తు సమోచితౌ" వితి భాస్కరః. గిరా వాచా అత్ర కల్పప్రత్యయవిధానా దిత్యర్థః. అత్ర దాక్షిణ్యమాధుర్యవైభవానాం ధర్మాణా మనుపాదానా ద్ధర్మలుప్తేయం.

ధర్మవాచకలుప్తా.

శ్లో. అనుక్తధర్మే వాది స్స్యాద్
ద్వివిధేణ ములిక్యచి
క్విపిక్యజీసమాసే చ
సప్తధా కవిసంమతా.

ధర్మవాచకలుప్తా మాహ అనుక్తేతి. అనుక్తధర్మేవాది రితి లక్షణపరం శిష్టం విభాగపరం ద్వివిధేణములిద్వివిధేక్యచిక్విపిక్యజీ సమాసే చేతి ధర్మవాచకలోపవతీ భవతీ త్యర్థః. సా చోక్తవిధయా సప్తవిధా భవతీ.

కర్తృణముళి యథా.

శ్లో. సూర్యరాయ మహీనాథ
సార్వభౌమ ముఖాంబుజే

కటాక్షా స్సారసాక్షీణామ్
భృంగచారం చరంతి తే.

అత్ర భృంగా ఇవ చరిత్వా భృంగచార మితి కర్తృణ ములిధర్మ వాచకలుప్తా. కర్తృణ ములిధర్మవాచకలుప్తా ముదాహరతి సూర్య రాయమహీనాథేతి. హే సూర్యరాయ మహీపతిసార్వభౌమ తే తవ ముఖాంబుజే సారసాక్షీణాం కామినీనా మిత్యర్థః. కటాక్షాః భృంగా ఇవ చరిత్వా భృంగచారం చరంతి. ఉపమానే కర్మణి చేతి చకారా త్కర్తరి ణముల్. కషాదిత్వా చ్చరతే రనుప్రయోగ శ్చ లక్ష్యే లక్షణం పాతయతి అత్రేతి.

కర్మణముల్యథా.

శ్లో. పశ్యంత్య స్సూర్యరాయేంద్ర
సార్వభౌమం మృగీదృశః
పలాలదర్శం పశ్యంతి
సాక్షా దపి చ మన్మథమ్.

అత్ర పలాల మివ పశ్యంతీతి కర్మణ ములిధర్మవాచకలుప్తా. కర్మణ ములితా ముదాహరతి పశ్యంత ఇతి. సూర్యరాయేంద్రసార్వభౌమం పశ్యంత్యః మృగీదృశః కామిన్యః సాక్షా న్మన్మథ మపి పలాల స్తృణ కణిశాది రహితకాష్ఠవిశేషః. పలాలో స్త్రీ స నిష్ఫల ఇత్యమరః. త మివ దృష్ట్వా పలాలదర్శం పశ్యంతి ఉపమానే కర్మణి చేతి. కర్మణి ణముల్ప్రత్యయే కషాదిత్వా దనుప్రయోగ శ్చేతి కర్మణ ములిధర్మ వాచకలుప్తా.

అధికరణక్యచి ధర్మవాచకలుప్తా యథా.

శ్లో. సూర్యరాయేంద్ర తే చాపా
ద్గళద్బాణోద్ధతాశుగాః
పక్వతాళఫలీయంతి
హంత శాత్రవమూర్ధసు.

అత్ర పక్వతాళఫలే ష్వివ ఆచరంతీతి వివక్షితే అధికరణా చ్చేతి అధికరణక్యచిధర్మవాచకలుప్తా.

అధికరణక్యచా తా ముదాహరతి సూర్యరాయేంద్రేతి. హే సూర్యరాయేంద్ర తే చాపా ద్గళద్భ్యః బాణేభ్య ఉద్ధతా ఆశుగా మరుతః శాత్రవమూర్ధసు రిపుమ స్తకేషు పక్వతాళఫలీయంతి పక్వతాళఫలే ష్వివ ఆచరంతి హంతేతి ఖేదే ధర్మవాచకలోపం దర్శయతి అత్రేతి అధికరణా చ్చేతి వచనా త్క్యచ్ప్రత్యయః క్యచిచేతీకారః.

కర్మక్యచి యథా.

శ్లో. శ్రీ సూర్యరాయాధిపకోపదావో
యాన్కాననీయ త్యరిభూపసంఘాన్
తే ష్వేవ భూయ శ్శరణం గతేషు
సుధాతరంగీయతి తత్కటాక్షః.

అత్ర కాననా నీ వాచరతీతి ఉపమానా దాచార ఇతి. క్యచవోవిధానా త్కర్మక్యచిధర్మవాచకలుప్తా.

కర్మక్యచితా ముదాహరతి శ్రీసూర్యరాయాధి పేతి. శ్రీ సూర్యరాయాధిపస్య కోపదావః కోపానలః యా నరిభూపసంఘా న్కాననీయతి కాననానీ వాచరతి. తే ష్వేవ శత్రుషు భూయ శ్శరణం గతేషు సత్సు తస్య సూర్యరాయవిభోః కటాక్షః సుధాతరంగీయతి సుధాతరంగ మివ ఆత్మాన మాచరతి. ధర్మవాచకలోపం విశదయతి. అత్రేతి స్పష్టమ్.

క్విపిధర్మవాచకలుప్తా యథా,

శ్లో. సూర్యరాయ మహీజానిమ్
పశ్యంతీనాం మృగీదృశామ్
ఆగ్నేయతి విధో ర్బింబ
మంగారంతి చ తత్కరాః.

అత్ర ఆగ్నేయమి వాచరతీ త్యుపమానా దాచార ఇ త్యధికారే సర్వప్రాతిపదికేభ్యః క్విబ్వా వక్తవ్య ఇతి. క్విపి ధర్మవాచకలుప్తా. క్విపితా ముదాహరతి సూర్యరాయమహీజాని మితి. విధో శ్చంద్రస్య "విధూవిష్ణునిశాకరా" వితి ప్రతాపః. బింబం మండలం ప్రతిబింబే తత్ప్రతికృతౌ "ప్రతికృత్యాం చ మండల" ఇతి రత్నమాలా. ఆగ్నేయ మాగ్నేయాస్త్రం తది వాచరతీ త్యాగ్నేయతి. తత్కరా శ్చంద్ర కిరణా అపి అంగారా ఇవ ఆచరంతీ త్యంగారంతి లోపం విపినక్తి. అత్రేతి అత్రాచారార్థస్య సమానధర్మత్వవాదీ కావ్యప్రకాశకారోపి తద్వాచకస్య క్విప స్సర్వలోపాదివాదిలోపా చ్చ ద్విలోప మేవా హాసీత్ క్యజాదా తు ప్రత్యయదర్శనా దేకలోప ఏవేత్యుదాజహా రేతి చేన్నక్యజాదా వపి యథాయోగ ముపమానోపమేయగతో ధావళ్యాది రేవ సమానధర్మో నాచారమాత్రం త స్యాన్యధర్మత్వా దితి మన్యమానా విద్యానాథాదయ స్సర్వత్ర ద్విలోపమే వాహు రితి. అన్యథా లుప్తప్రత్యయా ప్రకృతిః ప్రత్యయార్థం వదతీతి న్యాయేన క్విప స్సర్వలోపేపి ఆచారార్థస్య గమ్యమానత్వా దేకలోప ఏవ భవి తవ్యః. నను తథై వాస్త్విత్యంగీకారే మురారిపథన్యాయేన మూల చ్ఛేదీ తవ పాండిత్యప్రకర్ష ఇత్యలం బహునా.

క్యజిధర్మవాచకలుప్తా యథా.

శ్లో. సూర్యరాయ మహీజానేః
ప్రాణిమాత్రే కృపారసః
శరద్రాకేందు బింబాంశు
క్రాంత రత్నాకరాయతే.

అత్ర రత్నాకర ఇవ ఆచరతీతి క్యజిధర్మవాచకలుప్తా. క్యజిధర్మవాచక లుప్తా ముదాహరతి సూర్యరాయమహీజానే రితి. సూర్యరాయమహీ

జ్ఞానేః కృపారసః ప్రాణిమాత్రే సర్వేష్వపి జంతుష్విత్యర్థః. యోజయతి అత్రేతి రత్నాకర ఇవాచరతీతి రత్నాకరాయతే. కర్తుః క్యఙ్సలోప శ్చేతి క్యఙ్ప్రత్యయే జీత్వా దాత్మనేపదం. అత్రోపమాన కర్తు రంతర్భూతత్వా దుపమేయకర్త్రా సకర్తృకత్వ మితి భాష్యకారః. ధర్మలోపాది వాదిలోపా చ్చ ద్విలోపః.

సమాసే యథా.

శ్లో. ఆఖండలాభినంద్యేన
వైభవేన సమంచితః
విభాతి సూర్యరాయేంద్రో
రాజేందుః ప్రథితో భువి.

అత్ర రాజా ఇందు రివేతి సమాసే ధర్మవాచకలుప్తా సమాసేన తా ముదాహరతి ఆఖండ వేతి. ఆఖండల స్యేంద్రస్యాపి అభినంద్యేన వైభవేన సమంచితః. అత ఏవ భువి ప్రథిత స్సూర్యరాయేంద్ర ఇతి రాజేందు ర్విభాతి. అత్ర ధర్మవాచకలోపం దర్శయతిఅత్రేతి. రాజేందు రిత్యత్ర సామాన్యాప్రయోగ ఏవ సామానాధికరణ్యా త్సమాస స్సంభవతి. త దుక్తం వ్యాఘ్రశబ్దో యదా శౌర్యా త్పురుషార్థే వర్తతే తదాధికరణా భేదా త్సమాస స్యాస్తి సంభవః శూరశబ్దప్రయోగే తు వ్యాఘ్రశబ్దో మృగే స్థితః భిన్నే ధికరణే వృత్తే స్తత్ర నైవాస్తి సంభవ ఇతి. అతోత్ర ధర్మలోపాదివాదే రభావా చ్చ ధర్మవాచకలుప్తా సమాసగతా.

ఉపమానలుప్తా.

శ్లో. లుప్తోపమానా ద్వివిధా
ప్రోక్తా వాక్యసమాసయోః.

ఉపమానలుప్తాం లక్షయతి లుప్తేతి. ఉపమానలుప్తా వాక్యగతా సమాసగతేతి ద్వివిధే త్యర్థః.

వాక్యగతా యథా.

శ్లో. త్వత్ఖడ్గేన సమః క్రూరః
స్సూర్యరాయేంద్ర నేక్ష్యతే
యశ్చిత్రం స్మృతమాత్రో ఽపి
స్తంభయత్యఖిలద్విషామ్.

అత్ర ఖడ్గేన సమా నేక్ష్యత ఇత్యుపమానలుప్తా వాక్యగతా. వాక్యగతా ముపమానలుప్తా ముదాహరతి త్వత్ఖడ్గే నేతి యోజయతి అత్రేతి.

సమాసగతా యథా.

శ్లో. సూర్యరాయేంద్రసదృశో
మహాన్దాతా న దృశ్యతే
యేన విస్మారితాః కర్ణ
సురద్రుసురధేనవః.

అత్ర సూర్యరాయేంద్రసదృశ ఇతి సమాసగతా ఉదాహరణద్వయే పి న ధర్మలోపః. క్రూరో దాతేతి చ గుణోపాదానాత్ ననూపమాన నిషేధావిశేషా దనన్వయా దస్యాః కో వా భేద ఇతి చే దనన్వయే ఉపమాన మేవ నిషధ్యతే. ఇహ తు న తన్నిషేధః క్రియతే. కింతు తద్దర్శన మేవ నిషిధ్యతే ఇతి భేదః. సమాసే నోపమానలుప్తా ముదా హరతి సూర్యరాయేంద్రేతి. కుత్రేయం లుప్తే. త్యత ఆహ అత్రేతి. సూర్యరాయేంద్రేణ సదృశ ఇతి సమాసగతా అత్ర ధర్మస్యాపి లోప ఇతి చే న్నాస్తీ త్యాహ ఉదాహరణద్వయేపీతి ననూపమాన లుప్తా నన్వయయో ర్న కోపి భేదః. ఉభయత్రా ప్యుపమాననిషేధా దిత్యాశంక్య సమాధత్తే అనన్వయ ఇతి. అనన్వయే ఉపమేయ స్యోప మానతాకల్పనా దుపమాన స్యాత్యంత మపలాపః క్రియతే. ఉపన మానలుప్తాయా స్తు ఉపమానస్య దర్శనమాత్రనిషేధా త్సదృశస్య సత్తా సంభావ్యత ఇత్యుభయో రయం భేదః.

ధర్మోపమానలుప్తా.

శ్లో. ధర్మోపమానయో ర్లోపే
యా సా వాక్యసమాసయోః.

ధర్మోపమానలుప్తాం లక్షయతి ధర్మోపమానయో రితి సా వాక్యగతా సమాసగతా చేతి ద్వివిధే త్యర్థః.

వాక్యగతా యథా,

శ్లో. శ్రీ సూర్యరాయేంద్ర తవైవ కీర్త్యా
సమం త్రిలోకేఽపి న కించి దస్తి
యద్యోగభాజ స్సరిత స్సమస్తా
విశంతి శైవం యుగపత్కపర్దమ్.

వాక్యగతా ముపమానధర్మలుప్తా ముదాహరతి శ్రీ సూర్యరాయేంద్రేతి. హే సూర్యరాయేంద్ర, తవ కీర్త్యా సమం త్రిలోకేపి కించి దపి నాస్త్యేవ, తత్ర హేతు మాహ యస్యాః కీర్తే ర్యోగం సంబంధం భజంత ఇతి తద్యోక్త్యాః. సమస్తా స్సరితః యుగపత్సమమేవ శైవం కపర్దం జటాజూటం విశంతి, నదీవ్యాజేన స్వయ మపి హరజటాజూట మగా దితి భావః. అత్ర జటాజూటవగాహనం న సాధారణో ధర్మః. ధావళ్య మేవ తదనుపాత్త మితి ధర్మోపమానలుప్తేయం భవతి.

సమాసగతా యథా.

శ్లో. శ్రీ సూర్యరాయక్షితిపాలమౌళే
ర్నక్వాపి లోకే భుజయుగ్మతుల్యమ్
అభూతపూర్వం భువి యత్ర్పతాప
మాబాలగోపం మనుజా స్తువంతి.

అత్ర పూర్వత్ర చ ఉపమానాక్షేపాభావా న్న ప్రతీపాలంకారశంకావకాశః. ఉపమేయస్యాప్యాధిక్యం న వివక్షితం ప్రతీపాలంకారాభేదాపత్తేః సమాసగతా ముదాహరతి శ్రీ సూర్యరాయేతి. క్వాపిన నాస్తి

కుత ఇత్యత ఆహ భువి అభూతపూర్వం పూర్వ మవిద్యమానం యస్య ప్రతాపం ఆబాలగోపం బాలపశుపాలకేభ్య ఆరభ్యేత్యర్థః. మనుజా స్త్స్వంతి ప్రతీపాలంకారో భేదాపత్తిం వారయతి అత్రపూర్వత్ర చేతి ధర్మోపమానలుప్తాద్వయేపీ త్యర్థః.

వా చ క లు ప్తా.

శ్లో. అనుక్తావాచకా లుప్తా
సమాసే నైకధా మతా.

వాచకలుప్తాం లక్షయతి అను క్తేతి.

య థా

శ్లో. సూర్యరాయవిభుః కీర్త్యా
చంద్రిగార్యాభిరంజితం
లాలయ త్యన్వహం దోష్ణా
మేదినీ మచలం స్తనీమ్.

అత్ర కేవలవాచక స్యైవ లోపః.

వాచకలుప్తా ముదాహరతి సూర్యరాయవిభు రితి. చంద్రవద్గౌరీధవళాతయా అత్ర కస్య లోప ఇత్యత ఆహ అత్రేతి చంద్ర ఇవ గౌరీతి సమాసే వాచకలోపా ద్వాచకలు ప్తేయమ్.

ధర్మోపమాన వాచకలుప్తా.

శ్లో. ఉప మేయం వినాన్యేషామ్
లోపే యాసైకధా మతా,

ధర్మోపమానవాచకలుప్తాం లక్షయతి ఉపమేయం వినేతి. అన్యేషాం ధర్మోపమానవాచకానామ్.

య థా.

శ్లో. విభాతి రాజరాజ శ్రీ
స్సూర్యరాయమహీపతిః
యస్మై స్పృహయతే దేవ
స్సకలాపకలాపభృత్.

అత్ర రాజరాజస్య శ్రీరివ భూరిశ్రీర్యస్య స ఇతి సప్తమ్యుపమాన పూర్వపదస్య బహువ్రీహిర్వాచ్యో వోత్తరపదలోపశ్చేతి ధర్మోపమానవాచకలుప్తా. ఉదాహరతి విభాతీతి. సూర్యరాయమహీపతిః రాజరాజః కుబేరః రాజరాజో ధనాధిప ఇత్యమరః. ఉత్తరార్ధే నవిశినష్టి యస్మాదితి కలా ఆప్నోతీతి కలాపశ్చంద్రః సకలాపో భూషణం తం బిభర్తీతి తథోక్తః. చంద్రశేఖర ఇత్యర్థః. స దేవః యస్మై స్పృహయతే యద్వా రాజా ఇంద్రః "రాజా ప్రభౌ నృపే చంద్రే యక్షే క్షత్రియశక్రయో" రితి విశ్వః. తస్య రాజశ్రీ రాజ్యలక్ష్మీః సేవ భూరిరాజశ్రీర్యస్య స తథోక్తః. కలాపం మయూరబర్హం తమేవ కలాపం భూషణం బిభర్తీతి తథోక్తః. కలాపో భూషణే బర్హ ఇత్యమరః. స దేవః కృష్ణః శేషః ప్రాగ్వత్. ఏకత్వ మిత్రత్వేనాన్యత్ర సోదరత్వేన చేతి తాత్పర్యం లక్ష్యే. లక్షణం యోజయతి అత్రేతి. తద్విధాయకశాస్త్ర మాహ సప్తమ్యుపమానేతి అన్వాయ మర్థః. సప్తమ్యంతం తావ దాస్తాం ఉపమానం పూర్వపదం యస్య సమాసస్యతస్య శబ్దాంతరేణ బహువ్రీహిః. పూర్వసమాసావయవస్య ఉత్తరపదస్య చ లోప ఇతి తేనేదం ఫలితం. అతోఽపమానశబ్దేన ముఖ్యోపమానభూతస్య శ్రీశబ్దస్య ఆశ్రయో రాజరాజో లక్ష్యతే. తత్పూర్వపదస్య ఉపమేయవాచినా బహువ్రీహిః. తతః పూర్వసమాసావయవభూతస్య ఉత్తరపదస్య ముఖ్యోపమానభూతస్య శ్రీశబ్దస్య చ లోపే ధర్మస్యభూరిత్వస్య ఉపమానవాచకయో శ్చ త్రయాణాం లోపాద్ధర్మోపమానవాచకలుప్తా సమాసగతే త్యవగంతవ్యం.

ధర్మోపమేయవాచకలుప్తా.

శ్లో. వర్ణ్యవాచకధర్మాణామ్
లోపే యాసైకథా మతా.

ధర్మోపమేయవాచకలుప్తాం లక్షయతి వర్ణ్యేతి వర్ణ్య ముపమేయమ్,

యథా.

శ్లో. శ్రీసూర్యరాయాధిపకోపదావో
యథా న్యాకనీయ త్యరిభూపసంఘాన్
తే ష్వేవ భూయ శ్శరణం గతేషు
సుధాతరంగీయతి తత్కటాక్షః.

అత్ర తరంగ మివాత్మాన మాచరతీతి వివక్షితే ఉపమానా దాచార ఇతి క్యచిధర్మోపమేయవాచకలుప్తా.

ఉదాహరతి శ్రీసూర్యరాయాధి పేతి. వ్యాఖ్యాత మేతత్. ఉక్తలోపం వివృణోతి అత్రేతి వాచకస్యేవ శబ్దస్య ఆత్మన ఉపమేయస్య ధర్మస్య చానుపాదానా ద్ధర్మోపమేయవాచకలుప్తా.

ఉపమాసంఖ్యా.

శ్లో. ఏకోనవింశతి ర్లుప్తాః
పూర్ణాషట్చనిరూపితాః.

ఇయతా ప్రబంధేన ఉపపాదిత ముపమాప్రపంచం సంకలయ్య దర్శయతి ఏకోనవింశతి రితి ధర్మలుప్తాదీనా మేకోనవింశతిః. తత్ర ధర్మలుప్తాః పంచధర్మవాచకలుప్తా స్సప్త ఉపమానలుప్తే ద్వే. ధర్మోపమానలుప్తే ద్వే. వాచకలుప్తైకా. ధర్మోపమానవాచకలుప్తైకా. ధర్మోపమేయవాచకలుప్తైకా. చేత్యేకోనవింశతిః పూర్ణాషట్చేతి సంకలయ్య పంచవింశతి రుపమాభేధా నిరూపితా ఇత్యర్థః.

మాలోపమాలంకారః.

శ్లో. ఏకస్యై వోపమేయస్య
యత్రానేకాన్యవర్ణనమ్
క్రియతే కవిభి స్తత్ర
కథ్యతే మాలికోపమా.

మా లోపమాం లక్షయతి ఏకస్యైవేతి. యత్ర ఏకస్యైవోపమేయస్య అనేకాన్యవర్ణనమనేకోపమాననిరూపణం తత్ర మాలోపమే త్యర్థః.

యథా.

శ్లో. శ్రీ సూర్యరాయేంద్ర భుజప్రతాపా
హరిద్వధూనా మిహ కుంకుమంతి
ప్రవాళహారంతి చ యావకంతి
కల్హారహారంతి చ రంజనంతి.

అత్ర అనేకోపమానోపాదానా న్మాలోపమా.

ఉదాహరతి శ్రీ సూర్యరాయేం ద్రేతి. శ్రీ సూర్యరాయేంద్రస్య భుజప్రతాపా ఇహాలోకే హరిద్వధూనాం దిక్కాంతానాం దిశస్తు కకుభః కాష్ఠా ఆశా శ్చ హరిత శ్చ తా ఇత్యమరః. కుంకుమంతి కుంకుమా ఇవ ఆచరంతీతి. సర్వత్ర ద్రష్టవ్యం సర్వప్రాతిపదికేభ్యః క్విబ్వాచార ఇతి క్విప్ప్రత్యయః. ప్రవాళహారా విద్రుమమాలికాః "ప్రవాలో వల్లకీ దండే విద్రుమే నవపల్లవ" ఇతి విశ్వః యావకా లాక్షాః కల్హారాణి రక్తోత్పలాని "రక్తోత్పలం తు కల్హార" మిత్యమరః. లక్ష్యే లక్షణం యోజయతి. అత్రేతి ఏకస్యైవ ప్రతాపస్య కుంకుమాద్యనేకోపమానోపాదానా న్మాలోపమేతి లక్షణసంగతిః.

ఉపమాయాః ప్రకారాంతరేణ ద్వైవిధ్యమ్.

ఇయం చోపమావస్తుప్రతివస్తుభావేన బింబప్రతిబింబభావేన వా సంభవతి.

ధర్మస్య వస్తుప్రతివస్తుభావేన బింబప్రతిబింబభావేన వానిర్దేశే నోపమా సంభవతీ త్యర్థః.

వస్తుప్రతివస్తుభావః.

ఏకస్యైవ ధర్మస్య ఉపమానోపమేయగతత్వేన పదద్వయే నోపాదానం వస్తుప్రతివస్తుభావః.

తత్రాద్యం లక్షయతి ఏకస్యైవేతి. ఏకస్యైవ ధర్మస్య ఏకదా ఉపమేయవస్తుత్వేన నిర్దేశః. పున రుపమానేపి ప్రతివస్తుత్వేన ప్రతియోగ్యర్థతయా ఏకశబ్దోపాదానేన పౌనరుక్త్యాపత్తేః శబ్దాంతరేణ నిర్దేశో వస్తుప్రతివస్తుభావ ఇ త్యన్వర్థసంజ్ఞా.

### బింబప్రతిబింబభావః.

భిన్నయో రేవ ధర్మయోః పదద్వయే నోపదానం బింబప్రతిబింబభావః.

ద్వితీయం లక్షయతి భిన్నయో రేవేతి వస్తుతో భిన్నయో రేవే త్యర్థః. నను భిన్నధర్మయోః కథం సమానధర్మ తేతి చే ద్భిన్నయో రపి సాదృశ్యేన బింబప్రతిబింబభావస్థితయో రభేదాధ్యవసాయేన ఉభయో ర ప్యేకధర్మత్వా త్సమానధర్మతాలాభ ఇతి బోధ్యమ్.

### ధర్మనిర్దేశః.

ధర్మస్య నిర్దేశోపి ద్విధా సంభవతి సకృన్నిర్దేశేన పృథఙ్నిర్దేశేన చేతి.

### సకృన్నిర్దేశః.

ధర్మస్య సకృదుపమానోపమేయగతత్వేన నిర్దేశస్సకృన్నిర్దేశః సకృన్నిర్దేశ మాహ ధర్మ స్యేతి.

### పృథఙ్నిర్దేశః.

బింబప్రతిబింబభావేన వస్తుప్రతివస్తుభావేన వా ధర్మనిర్దేశః పృథఙ్నిర్దేశః.

పృథఙ్నిర్దేశ మాహ బింబప్రతిబింబభావే నేతి.

### సకృన్నిర్దేశో యథా.

శ్లో. చంద్రవ త్సూర్యరాయేంద్రమ్
భువనోల్లాసదాయకమ్
కూపారా ఇవ గంభీరా
స్సేవంతే మనుజా స్సదా.

అత్ర భువనోల్లాసదాయకం గంభీరా ఇతి చ ఉభయత్రాపి ఏకదాధర్మనిర్దేశా త్సకృన్నిర్దేశః.

సకృన్నిర్దేశ ముదాహరతి చంద్రవ దితి. భువనోల్లాసదాయకం ఏకత్ర లోకాహ్లాదజనక మన్యత్ర జలవృద్ధికరం చ. "భువనం ఖాం జలో కేష్వితి" రత్నమాలాయాం. చంద్రేణ తుల్యం చంద్రవ దితి తేన తుల్య మిత్యాదినా వతిప్రత్యయః. యద్వా చంద్ర మివ చంద్రవ దితివా ఇవవద్వా యథా శబ్దాదికోశాత్ కూపారా సముద్రాః "అకూపార శ్చ కూపార ఇతి ద్విరూపకోశే. గంభీరాః సకృన్నిర్దేశం లక్ష్యే యోజయతి అత్రేతి ఉభయ త్రోపమానోపమేయయోః.

పృథఙ్నిర్దేశో వస్తుప్రతివస్తుభావేన యథా.

శ్లో. శ్రీ సూర్యరాయేంద్రమహీధరేణ
విద్రావిత శ్శాత్రవభూపవర్గః
ప్రభాకరే నైవ తమఃప్రపంచః
ప్రణాశమహ్నాయ చ ధావితోఽస్మిన్.

అత్రైకస్యైవ ధర్మస్య విద్రావితధావితపదద్వయేన వాక్యద్వయేపి నిర్దేశా త్పృథఙ్నిర్దేశః.

ఉదాహరతి సూర్యరాయేంద్రేతి. అస్మిన్ లోకే అహ్నాయ ఝనే నేత్యర్థః. యోజయతి అత్రేతి వాక్యద్వయేపి ఉపమానోపమేయ వాక్యయోః.

స ఏవ బింబప్రతిబింబభావేన యథా.

శ్లో. వసం త్వనేకే భువి సూర్యవంశ
శ్రీసూర్యరాయప్రభునా విభాతి
అనేకరత్నోపి పయఃపయోధి
ర్విరాజతే కౌస్తుభనామకేన.

అత్ర సూర్యరాయప్రభుకౌస్తుభయో స్సాదృశ్యా త్సూర్యవంశరత్నాకరయో రపి సాదృశ్య మితి బింబప్రతిబింబభావేన పృథఙ్నిర్దేశః. ఉదాహరతి వసం త్వితి. అనేకే రాజానః వసంతు సూర్యవంశః. శ్రీసూర్యరాయప్రభునా విభాతి పయఃపయోధిః. అనేకాని బహూని రత్నాని యస్య స తథోక్తః. తథాపి కౌస్తుభనామకేన విరాజతే యోజయతి అత్రేతి.

### పున రపి ద్వైవిధ్యమ్.

సమస్తవస్తువిషయా ఏకదేశవర్తినీ చేతి.

పున రప్య స్యా ద్వైవిధ్యం సంభవతీ త్యాహ సమ స్తేతి. సమస్తాని వస్తూ న్యవయవ్యవయవా శ్చ విషయా యస్యాం సా సమస్తవస్తువిషయా అవయవావయవినో రేకదేశే వర్తత ఇ త్యేకదేశవర్తినీతి చార్థః.

### ఆ ద్యా య థా.

శ్లో. వంశా భూమిభృతాం విభాంతి భువనే ధీరా స్సముద్రా ఇవ
శ్రీమా న్ప్రసదన్వయోతిమహితః క్షీరాంబురాశి ర్యథా
రాజా వేంకటసూర్యరాయనృపతి స్తత్ర ద్విజేంద్రో యథా
తత్కీర్తి శ్చ విరాజతే ఽతిధవళా నిత్యం యథా కౌముదీ.

అత్ర సర్వత్ర ఉపమానోపమేయభావోపాదానా త్సమస్తవస్తువిషయతా ఉదాహరతి వంశా ఇతి. భువనే లోకే భూమిభృతాం రాజ్ఞాం వంశా ధీరా గంభీరాః. "ధీరో గభీరో గంభీర" ఇతి సరస్వతీవిలాసే. సముద్రా ఇవ విభాంతి. తత్ర తేషు వంశేషు శ్రీమా న్ప్రవంశోతిమహితః క్షీరాంబురాశి ర్యథా క్షీరసాగర ఇవ విభాతి తత్ర వేంకటసూర్యరాయనృపతి రితి రాజా యద్వా ఆద్యో రాజా పదాంచితో వేంకటసూర్యరాయ నృపతి రితి మధ్యమపదలోపీ సమాసో వా ద్విజేం

దో౹ ద్విజరాజ శ్చంద౹ ఇత్యర్థః. స ఇవ విభాతి. అతిధవళా తస్య విభోః కీర్తి శ్చ నిత్యం న తు తదా తదా కౌముదీవ విరాజతే యోజ యతి అత్రేతి అవయవినో వంశస్య తదవయవానాం చోపమితి కరణ త్సమ స్తవ స్తువిషయా.

ఏకదేశవర్తినీ యథా.

శ్లో. సూర్యరాయనిహితాత్మవృత్తిభిః
కాముకీభి రివ కామితాద్విషామ్
శ్రీభి రంధతమసై రివ ద్విషై
రప్యసౌ నిబిడితా రణస్థలీ.

అత్ర రణస్థలీ సంకేతస్థలీ వేతి వ్రతీతే రేకదేశవర్తినీ.

ఉదాహరతి సూర్యరా యేతి. సూర్యరాయే రాజ్ఞి నిహితా ఆత్మవృత్తి శ్చిత్తవ్యాపారో యాభి స్తాభిః కాముకీభి రివ ద్విషాం శ్రీభి రాజ్యశ్రీభిః కామితా అంధతమసై రివ ద్విషేరపై రపి అసౌ రణస్థలీ నిబిడితా యోజయతి అత్రేతి.

ఏవ మన్యేపి భేదా స్తత్ర తత్ర ద్రష్టవ్యా

ఇత్యుపమాలంకార నిరూపణం.

రశనోపమాది వైచిత్ర్యనిరూపణే విస్తరభయా దన్యతో గ్రాహ్య మి త్యుపసంహరతి ఏవ మితి.

అనన్వయాలంకారః.

శ్లో. ఐక్యే హ్యానన్వయః ప్రోక్త
ఉపమానోపమేయయోః.

యత్ర ద్వితీయసదృశనిషేధద్యోతనా యైకస్యై వోపమానత్వ ముప మేయత్వం చ ప్రతిపాద్యతే త త్రానన్వయాలంకారః.

## శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు

| | | | |
|---|---|---|---|
| * 1 | సంపుటము | ... ... ... | 15_00 |
| * 2 | ” | ... ... ... | 15_00 |
| 3 | ” | ... ... ... | 15_00 |
| 4 | ” | ... ... ... | 15_00 |
| 5 | ” | ... ... ... | 15_00 |
| 6 | ” | ... ... ... | 15_00 |
| 7 | ” | ... ... ... | 15_00 |

* పునర్ముద్రితములు గానున్నవి.

Note:-7వ సంపుటములో సనుబంధము (శ, ష, స, హ)లు ముద్రిత మగుచున్నవి.

ప్రకాశకులు:

ఆంధ్ర సాహిత్యపరిషత్తు (రిజిష్టర్డు)

రామారావుపేట

కాకినాడ

Edited by K. Krishnasastry, Published by Andhra Sahitya Parishat and Printed by J. Bhaskara Rao, at Republic Press Main Road, Kakinada